# అస్పృశ్యత



రచయిత:
వియోగిహరి

అనువాదం:
బోళ్ల విష్ణు

ప్రకాశకులు:
గాంధీ సాహిత్య ప్రచురణాలయం
గాంధీ జ్ఞానమందిరం, సుల్తాన్‌బజార్, హైదరాబాద్ - 1.
గాంధేయ సమాజ సేవా సంస్థ
గాంధీక్షేత్రం అవనిగడ్డ 521123

మొదటి కూర్పు
1000 ప్రతులు
1981 ఆగష్టు
వెల : రూ. 7 (ఏడు రూపాయలు)



అస్పృశ్యత

గాంధీ సాహిత్య ప్రచురణాలయం
118 వ ప్రచురణ



భారత ప్రభుత్వంవారు పరసమైన వెలకు లభింపచేసిన
కాగితంపై ఈ పుస్తకము ముద్రించబడినది.

ముద్రణ :
లలితా ప్రింటింగ్ అండ్ బైండింగ్ వర్క్స్
హైదరాబాదు - 500 380

# ప్రకాశకుల నివేదన

గాంధీ సాహిత్య ప్రచురణాలయం అస్పృశ్యత అనే పుస్తకాన్ని గాంధీ శతాబ్ది సమయంలోనే ప్రచురించవలసియుండినది. కాని అనుకోని విధంగా ఈ పుస్తక ప్రచురణ ఆలస్యం అయినందుకు చాలా విచారిస్తున్నాము. సుప్రసిద్ధ పండితులు — చాలాకాలం అఖిల భారత హరిజన సేవక సంఘానికి అధ్యక్ష పీఠాన్ని అలంకరించిన శ్రీ వియోగి హరిగారు ఈ పుస్తకాన్ని హిందీలో రచించారు. ఇప్పటికి అస్పృశ్యత గురించి వచ్చిన పుస్తకాలన్నిటిలో ఇది విశిష్టమైనది. అస్పృశ్యత పూర్వాపరాలు, దాని పరిణామాలు, ఆధునిక యుగంలో దాన్ని రూపుమాపడానికి జరిగిన ప్రయత్నాలు వివరించడమే కాకుండా హిందూమత మూలసూత్రానికి అస్పృశ్యత ఏ విధంగా విరుద్ధమైనదో కూడా స్పష్టీకరించారు. శ్రుతి స్మృతులనుండి అనేక ఉదాహరణలు ఇచ్చారు. హిందూధర్మంలో వివిధ సంప్రదాయాలకు చెందిన ప్రవక్తలు ఏ విధంగా అస్పృశ్యతను వ్యతిరేకించారో ఎత్తిచూపించారు. భారతదేశ చరిత్రలో స్వర్ణయుగ మనదగిన గాంధీ యుగంలో అస్పృశ్యతా నివారణకు జరిగిన కృషి అమోఘమైనది. దానిని శ్రీ వియోగి హరిగారు విపులంగా చర్చించారు. స్వాతంత్ర్యానంతరం జరిగిన కృషిని కూడా పేర్కొంటూ ఆ కృషి అసమగ్రమైనదనీ ఇతోధికంగా కృషి జరుగవలసిన అవసరాన్ని నిరూపించారు. ఈ పుస్తకం హిందూ సంఘాన్నేగాక యావత్తు మానవ సమాజాన్ని ఉచ్ఛనీచాలు లేకుండా సంస్కరించవలెననే ప్రతివారూ పఠించవలసినది. యువతరం ఈ పుస్తకాన్ని చదివితే హిందూధర్మం అస్పృశ్యతను పాటించవలెనని శాసిస్తున్నదన్న అపోహ తొలగిపోగలదు.

ఈ పుస్తకాన్ని తెలుగులో అనువదించిన శ్రీ చోళ్ళ విష్ణుగారు పశ్చిమ గోదావరి జిల్లా వాస్తవ్యులు. వారు హరిజన సంఘంలో పుట్టి పెరిగి వారి కష్టనష్టాలను స్వయంగా అనుభవించారు. సంఘ సంస్కర్తల ఆదరణవలన తాను పైకి రావడమే కాకుండా అనేకమంది హరిజనులను ఉన్నతికి తీసుకరావడానికి తోడ్పడ్డారు. ఢిల్లీలోని అఖిల భారత హరిజన సేవక సంఘంలో చిరకాలం సేవచేసి ప్రస్తుతం అచటనే స్థిరనివాసం ఏర్పరుచుకున్నారు. వీరు తెలుగులో అనువదించి ఈ పుస్తకాన్ని గాంధీ శతాబ్ది సమయంలోనే అందించారు. కాని అనుకోనివిధంగా దీని ప్రచురణ ఆలస్యం జరిగినందుకు విచారిస్తున్నాము. అయినప్పటికీ పాఠకుల చేతికి ఈ పుస్తకాన్ని గాంధీ సాహిత్య ప్రచురణాలయం మరియు గాంధేయ సమాజ సేవా సంస్థ సంయుక్తంగా అందించగలిగి నందుకు సంతోషిస్తున్నాము. ఈ అనువాదాన్ని సంస్కరించిన డా॥ భీమసేన్ నిర్మల్‌గారికి మరియు ముద్రాపకులు లలితా ప్రింటింగ్ అండ్ బైండింగ్ వర్క్సు వారికి మా కృతజ్ఞతలు.

గాంధీ జ్ఞానమందిరం,<br>సుల్తాన్ బజార్,<br>హైదరాబాదు - 1.<br>తేదీ 15-8-81,

కో దా టి నా రా య ణ రా వు<br>అధ్యక్షులు<br>గాంధేయ సమాజ సేవాసంస్థ<br>కార్యదర్శి<br>గాంధీ సాహిత్య ప్రచురణాలయం.

# రెండు మాటలు

అస్పృశ్యత అంటే ఏమిటి? శారీరక అపవిత్రతకిది పర్యాయమా? ఐతే అందులో అసహజమేముంది? తరచుగ అది అన్ని దేశాల్లోనూ వున్నదే. దాన్ని పరిష్కరించవచ్చు కూడాను. కాని యీ అస్పృశ్యత యింకో రకమైనది. జన్మతః శాశ్వతంగా కొన్ని జాతులవారు అస్పృశ్యులై పోయారు. దీని సమర్ధనకు కొన్ని స్మృతుల ప్రమాణాలు కూడా చూపుతున్నారు. ఇదే అర్థంకాకుండా ఉంది. సత్యం, ఆత్మైక్యత మీద ఆధారపడిన హిందూధర్మం ఈ అసత్యాన్ని ఎలా స్వీకరించ గలదు? ఆర్యుల స్వర్ణయుగమైన వైదికకాలంలో ఎక్కడా అస్పృశ్యత కనుపించదే? ఐతే హిందూసమాజ పతనావస్థలో ఈ అస్పృశ్యత జనించిందేమో! ఇందులో సందేహంలేదు. అస్పృశ్యులనబడేవారు ఆర్యేతరులే కాని చరిత్రకారుడు రాయస్ మతప్రకారం ఆర్యేతరులు కారు. ఐదవ శతాబ్దివరకు అంటరానితనం పుట్టలేదన్న డాక్టరు అంబేద్కరు అభిప్రాయం తర్కసంగతంగా తలుస్తాను.

వైదికకాలంలో అస్పృశ్యత లేదు. దీని పుట్టుక సుమారు పదిహేనువందలయేండ్లదని తెలుస్తుంది. ఇలా అని హిందూధర్మంమీద పడిన కళంకం తక్కువకాదు. పాపం యెంత పాతదైనా, ఆధునికమైనదైనా లేక నేటిదే అనుకున్నా అది క్షంతవ్యమయినది కాదు. క్షమింపరాదు కూడాను. ఋషులు, మునులు, భక్తపురుషులు, సంస్క

ర్తలు యెంతోమంది దీనిని గర్హించారు. ఖండించారు. ఐనప్పటికీ యిది నశించలేదు.

అస్పృశ్యత ఉంటే హిందూధర్మ నాశనం తప్పదని ఘోషించాడు గాంధీజీ. అంటే హిందూధర్మంలో ఆత్మైక్యత లేదన్నమాట. వ్యాపకంగాను, అందరికంటే యెక్కువగాను అంటరానితనాన్ని గాంధీగారే ఖండించారు. గాంధీజీ కేవలం మాటలతోనే చెప్పలేదు. ఈ లజ్జాకరమైన దురాచారాన్ని మాన్పడానికి యెరవడా జైల్లో ప్రాణాలొడ్డి పోరుసలిపారు. అస్పృశ్యత నశించకుండా దేశానికి స్వరాజ్యం లభించిన అది అంత విలువైనది కాదని ఆయన నమ్మకం. అంటరానితనం కూకటివేళ్ళతో పెకికివేయడానికి గాంధీజీ చేసిన భగీరథ ప్రయత్నమే ఆయన తన జీవితంలో మనకిచ్చిన గొప్ప వరమని చెప్పాలి.

పైనచెప్పబడిన దాని పరిణామమే భారతీయ రాజ్యాంగంలో చట్ట సమ్మతంగా అస్పృశ్యతను అంతమొందించడం. నేరం అయినప్పటికీ అంటరానితనం అంతరించ లేదు. ఇది క్రమక్రమేపి కాలప్రభావంతో సడలింది, బలహీనమయింది. ఆయితే పూర్తిగా నశించలేదు. దాని భయంకర రూపం అప్పుడప్పుడూ, అక్కడక్కడా అవుపడుతూనే వుంది అస్పృశ్యతా ఉన్మూలన కొరకు గాంధీజీ చూపిన గొప్ప ఉపాయం, "అగ్రవర్ణులు చేసే ప్రాయశ్చిత్తం, లేక తపస్సు" అని. అదిసరిగ్గా గ్రహించలేక పోవడమే విచారకరమైన విషయం. నిమ్నజాతుల ఆర్థిక పతనావస్థ కూడాశోచనీయమైనదే కనుక సమాజంలో వారిని అన్నివిధాలా సమానస్థాయికి తేవడానికి ప్రభుత్వం, ప్రజాసంస్థలు బాగా యత్నించాలి. వారికిప్రాధాన్యత యివ్వాలి.

అస్పృశ్యత అంటే ఏమిటి? చారిత్రక, సామాజిక దృష్ట్యా దాని నివారణార్థం యేయే ప్రయత్నాలు జరిగాయి? మన హిందూధర్మం మీద, జాతిపైనగల ఈ కళంకం కడిగి వేయడానికి మనం చేయవలసిన కర్తవ్యమేమిటి? మొదలగు విషయాలు దిఙ్మాత్రంగానే ఈ పుస్తకంలో వివరించ బడ్డాయి.

—వియోగిహరి

# విషయ సూచిక

# 1

# అస్పృశ్యత అంటే ఏమిటి?
# అది ఎప్పటినుంచి?

స్మృతుల మతానుసారం ఒక వ్యక్తిని తాకటవలన రెండవ వ్యక్తికి కలిగెడి అపవిత్రత, అశుభ్రతయే అస్పృశ్యత. జన్మమృత్యు సమయాలలోను రజస్వలను ముట్టుకోరాదన్నారు. అది అపవిత్రత, అశుభ్రత అన్నారు. కాని అదొక పరిమిత కాలంలో మాత్రమే.

కాని అనేక జాతులకు జాతులే—వ్యక్తులు కాదు — శాశ్వతంగా అపవిత్రులుగానే, అస్పృశ్యులుగానే ఎన్నబడ్డాయి. విష్ణు-ధర్మ-సూత్రా (5, 104) నుసారం, మను (4, 61), వేదవ్యాసు (1, 11-12) ల మతానుసారం కూడాను. అన్త్యులనీ (వశిష్ఠ-ధర్మ-సూత్రం 16-30), బాహ్యులనీ (ఆపస్తంబ సూత్రం 1, 2, 39, 15) వీరికి పేర్లు. 'అన్త్యవసాయీ' (గౌతమ 20-1; మను 4-79) అనేవారు అందరికంటే నీచులుగ తలపబడ్డారు. మితాక్షరా (యాజ్ఞవల్క్య 3/258) ప్రకారం అంత్యజులు రెండు తెగలు — మొదటివారు ఉచ్చ అంత్యజులు; రెండవ తెగవారు చండాల, స్వపచ, క్షత్తా, సూత, వైదేహిక, మాగధ, ఆయోగవ అని

ఏడు రకాలవారు. అంత్యజుల నామరూపాలు, సంఖ్యలను వేరువేరు స్మృతులు, వేరువేరు విధాలుగ చూపుతున్నాయి. వీరి గుణగణాదుల వ్యాఖ్య గూడా ధర్మసూత్రాలు, స్మృతులు పరస్పర విరుద్ధంగానే చూపుతున్నాయి. డాక్టర్ అంబేద్కరు "ది అన్‌టచ్‌బిల్స్" (The Untouchables) అనే తన పుస్తకంలో ఒక జాబితానిచ్చారు. దాని ప్రకారం వేరువేరు స్మృతుల్లోను, ధర్మసూత్రాల్లోను అస్పృశ్య, అన్త్య, బాహ్య, అంతేవాసి, అన్త్యజ అనే పేర్లు అవుపడుతున్నాయి. ఆ జాబితా ఇది :—

## అస్పృశ్యులు

| ధర్మసూత్ర గ్రంథం | స్మృతి |
|---|---|
| 1. విష్ణు 5, 104 | 1. కాత్యాయన-కారికా 433, 783 |

## అన్త్య

| ధర్మసూత్ర గ్రంథం | స్మృతి |
|---|---|
| 1. వశిష్ఠ 16-30 | 1. మను 4-75, 8-68 |
| | 2. యాజ్ఞవల్క్య 1-848, 197 |
| | 3. అత్రి 25 |
| | 4. లిఖిత 92 |

## బాహ్య

| ధర్మసూత్ర గ్రంథం | స్మృతి |
|---|---|
| 1. ఆపస్తంబ 1, 2, 39, 18 | 1. మను 28 |

2. విష్ణు 16, 14 2. నారద 1-115

## అన్తేవాసి

| ధర్మసూత్ర గ్రంథం | స్మృతి |
|---|---|
| 1. గౌతమ 31, 23, 32 | 1. మను 4, 79, 10, 39 |
| 1. వశిష్ఠ 18, 3 | 2. మహాభారత శాంతిపర్వం 141, 29, 32 |
| | 3. మధ్యమాంగిరస (యాజ్ఞవల్క్య 3-280 మితాక్షరలో ఉద్ధృతము) |

## అన్త్యజ

| ధర్మసూత్ర గ్రంథం | స్మృతి |
|---|---|
| 1. విష్ణు | 1. మను 4, 61, 8-279 |
| | 2. యాజ్ఞవల్క్య 12-79 |
| | 3. బృహద్ యమ-స్మృతి (యాజ్ఞవల్క్య 3-26 మితాక్షరాలో ఉద్ధృతము) |
| | 4. మిత్ర |
| | 5. వేదవ్యాస్ 1-12-13 |

పై జాబితానుబట్టి చూస్తే విద్వాంసుడైన లేఖకుని మనస్సులో ఒక ప్రశ్న పుడుతుంది. అదేమంటే :—

" 'అన్త్య', 'అన్త్యజ', 'అన్తేవాసి', 'బాహ్య' ఆదిశబ్దాల ద్వారా బోధపడే జాతులే అస్పృశ్యులా ? అంటే అంటరానివారా ?

లేక ఒకే ఒక అంటరాని జాతికి గల వేరువేరు పేర్లా యివి ?

దురదృష్టమేమంటే ధర్మసూత్రాలీ ప్రశ్నకు సరియైన సమాధానం యివ్వలేకపోతున్నాయి. ధర్మసూత్రాలు, స్మృతులు యీ రెండింటిలోనూ 'అస్పృశ్యులు' అనే శబ్దం అవుపడుతుంది. కాని యింకెక్కడా యీ శబ్దం ద్వారా బోధపడే జాతుల సంఖ్య కనుపించడంలేదు. 'అన్త్య' శబ్దానికి కూడా యిదే గతి. ఈ శబ్దప్రయోగం మాత్రం ఆరుచోట్ల — అంటే రెండు సూత్రాల్లోనూ, నాలుగు స్మృతుల్లోనూ అవుపడుతుంది. కాని ఏయే వర్గాలకోసం యీ శబ్దం వాడారో ఒక్కచోట కూడా చక్కగా వివరించలేదు. ఇదే విధంగ 'బాహ్య' శబ్దం నాలుగుచోట్ల — అనగా రెండు సూత్రాల్లోను, రెండు స్మృతుల్లోను కనుపిస్తుంది. అంతేకాని యీ శబ్దంలో ఏయే జాతులు వేరువేరు విధాలుగ గోచరమవుతున్నాయి. ఇనపగజ్జెల తల్లిలా అపవిత్రత శాశ్వతంగా తిష్టవేసుకుని కూర్చునేదికాదు. ఎన్నటికీ మారని అస్పృశ్యత కానేకాదు. హిందూసమాజంలో కొన్ని జాతులను అంటరానివారినిగ, చూడరానివారినిగా జేసి, వారిని అమానుషకంగా చూచే రివాజు మన దేశంలో తప్ప యితర దేశాల్లో యెక్కడా కనుపించదు. ఈలాంటి అంటరానితనానికి బౌద్ధిక ఆధారాలు లేవు. జాతులకు జాతులనే అస్పృశ్యత పేరుతో సమాజంనుంచి వేరుచేయడం, దీన్ని సమర్థించడానికి శాస్త్రప్రమాణాల సహాయమపేక్షించడం బుద్ధిగ్రాహ్యం కాదు. ఒక శిశువు అంటరానితనాన్ని వెంటబెట్టుకొని జన్మిస్తాడనడం సబబుకాదు. తర్కానికసలే అక్కర్లేదు. సరేనయ్యా పుణ్యమో, పాపమో తన పూర్వజన్మ కర్మానుసారం ఒక మానవుడు

రెండవ జన్మమెత్తాడనుకుందాం. పుణ్యకర్మలు చేసినవాడు గొప్ప కులంలోను, పాపకర్మలు చేసినవాడు నీచకులంలోను పుట్టాడనుకుందాం. ఐతే అస్పృశ్యుని స్పర్శచే మైలబడిపోయిన ఒక అగ్రకులజుడు స్నానం చేసినంతమాత్రాన పవిత్రుడయిపోతాడు. జన్మతోటే అస్పృశ్యుడయిన వాడు పవిత్రుడెలా అవగలడు? అతడు అస్పృశ్యుడగనే పుట్టాడు. కనుక అస్పృశ్యుడుగానే చస్తాడు.

'పురుషసూక్తం'లో నాలుగు వర్ణాలున్నవి. అందు శూద్రుడు బ్రహ్మదేవుని పాదాలనుండి పుట్టాడట ఐతే అస్పృశ్యుడెక్కడనుండి పుట్టాడు? పాదాల క్రింద యింకొక అవయవముందా? పురుషసూక్తానికి పరస్పర విరుద్ధములయిన అనేక అర్థాలు చెప్పబడ్డాయి. కాని వ్యావహారికంగా అవి ఉచ్చనీచ భావాలతో నిండివున్నందువలన అందొకటీ కూడా సంతృప్తికరంగా లేదు మిగతా మూడు కులాల సేవ చేయవలసిన భారం శూద్రునిదేనని శాసించిన కాలంలో యీ 'పురుషసూక్త' రచన జరిగి ఉండవచ్చునేమో? వేదాల్లో 'శూద్ర' శబ్దం అవుపడుతుంది. కాని వేరే అర్థంలో వైదికకాలీన సమాజంలో శూద్రునికింత నీచస్థానం లేదు. అతనిపట్ల అన్యాయం చేసినట్లుగాని, కఠినంగా వ్యవహరించినట్టుగాని వేదాల్లో కనుపించదు. ఆదిలో మూడు వర్ణాలే వుండేవేమో? కాలం, ఆ తరువాతి కాలంనాటి చిత్రణమెక్కడ? కాలక్రమేణా సుందరమయిన సామాజిక పరంపర జాతిగత మౌఢ్యంలో లీనమైపోయింది; అభేదభావన వాడుకలో నిర్జీవమైపోయింది; తత్వజ్ఞానమంతా గ్రంథాలలోనే పేరుకుపోయింది. పర్యవసానంగా జరిగినదేమంటే — వికృతవర్ణవ్యవస్థ, ఉచ్ఛ

నీచజాతి భేదాల మధ్య ఉదారమైన హిందూ సమాజం చిక్కుల్లో పడిపోయింది.

హిందూధర్మాన్ని కళంకపరచేది, లోలోన దొలిచే చెదపురుగు లాంటి అస్పృశ్యత ఎప్పుడు, ఏ విధంగా పుట్టిందనే ప్రశ్న మిగిలింది మనకు. దీనికి సరయిన సమాధానంకోసం దేశదేశాల చరిత్రకారులు, సామాజిక అధ్యేతలు ఎంతో పరిశోధన చేశారు. శ్రీ స్టేన్లే రాయస్ అభిప్రాయానుసారం యుద్ధాలలో ఓడిపోయినవారి సంతతే అస్పృశ్యులంటేను. అంటే ఆర్యుల ద్వారా ఓడిపోయినవారి సంతతన్నమాట. తరువాత వీరికి హిందూధర్మంలో నిమ్నస్థానం లభించింది. ఇంకా ఆయనే "తమచే ఓడిపోయినవారిపట్ల ఆర్యులేవిధంగా ప్రవర్తించారో, అదే విధంగా పర్యాలు మొదలైన ఓడిపోయినవారిపట్ల ద్రావిడులు వ్యవహరించారు" అని వ్రాశారు. శ్రీ రాయస్ అభిప్రాయానుసారంగా అస్పృశ్యులు అనార్యులు, అంతేకాదు, ద్రావిడులు కూడాను. అంటే భారతదేశపు ఆదిమనివాసులే అస్పృశ్యులన్నమాట.

పై అభిప్రాయాన్ని డా॥ అంబేద్కరు ప్రామాణికంగా అంగీకరించలేదు. ఆయన మతప్రకారం భారతదేశంలో ఉన్నవల్లా రెండే రెండు వంశాలు ఆర్యులు, నాగులూను. శ్రీ రాయస్ ప్రకారం మూడు వంశాలు. డా॥ అంబేద్కరు చెప్పేదేమంటే "అస్పృశ్యతకు వంశం కారణమవుతుందన్న సంగతి మానవశాస్త్రం ప్రకారం పొరపాటు సరిగదా నాకు తెలిసినంతవరకు భారతీయ వంశాల చరిత్రలో కూడా దీనికి తగిన ఆధారాలు లేవు." ఆయనింకా యిలా అంటున్నారు :—

"భారతీయ ప్రజలు ఒకానొకప్పుడు 'దళాలు'గ వుండేవారన్న సంగతి సర్వవిదితమే గదా ? క్రమేపీ ఆ దళాలే జాతులుగ రూపొందాయి. ఐనప్పటికీ దళాల అస్థిత్వం నశించలేదు. ఆ దళాలు జట్లుగాను, జట్లు పరివారాలుగాను మారాయి....హిందూ సమాజంలో దళాల స్వరూపం నేటికీ కాననగును. గాన అస్పృశ్యత విభిన్న వంశాల పరిణామమనుకో డానికి వీలులేదు.

డా॥ అంబేద్కరు మురికిపనులు, అసహ్యమైన కార్యాలు అస్పృశ్యతకు మూలకారణమనే శ్రీ రాయప్ మతాన్ని పూర్తిగా ఖండించారు. ఆయన మతప్రకారం కొద్దిగొప్ప తేడాలతో యితర దేశాలలోనూ యీలాంటి నీచపుపనులున్నాయి. అక్కడా వున్నారు యీలాంటి పనులు చేసేవారు. అంతమాత్రాన ఆ పనులు చేసేవారిని అంటరానివారుగా చూచే ఆచారమక్కడ లేదు. ఇక్కడ కాస్త అభిప్రాయభేదముంది. మన దేశంలో అనేక ప్రాంతాల్లో అనేకమంది చర్మకారక వృత్తి విడిచిపెడుతున్నారు. దీనికి కారణం అత్యంత సమాజోపకారకమైన పని చేస్తున్నందుకుగాను సమాజం వారిని హీనం గాను, అంటరానివారుగాను చూడడమే. చర్మకారక వృత్తే హేయంగా తలంచబడుతున్నది. దీనికి కారణం మన దేశంలో యీ పని వైజ్ఞానిక పద్ధతుల ద్వారా నడకవకపోవడమే. ఇదేవిధంగా పాకీపని కూడా హేయంగా జరుగుతుంది. పాపం వాళ్ళు హేయమైన పని అజ్ఞానం వల్లను, వేరే గత్యంతరలేకను తప్పనిసరిగ చేస్తున్నారు. ఇందుచేతనే వాళ్ళు అస్పృశ్యులుగ ఉన్నారన్న సంగతి కాస్త వివేకంగల పాకీవారు గ్రహించగలిగారు. ఆ వృత్తి విడిచిపెట్టదలిచారు. తప్పనిసరిగ త్యజించ

వలసినదే. మలమూత్రాదులు పరిశుభ్రపరిచేవారిపట్ల యీలాంటి అనుచిత వ్యవహార మెక్కడా జరగడంలేదు. ఇటువంటి కొన్ని దేశాలు అంబేద్కరు దృష్టిలో వుండవచ్చునేమో ? కాని యిక్కడ ఆ హేయ వృత్తి విడిచిపుచ్చిన తరువాత కూడా అస్పృశ్యుడు స్పృశ్యుడుగా అవడం లేదే ? అయినప్పటికీ యీ పనులు విడిచిపుచ్చడంవలన — నెమ్మదిగానే అనండి — సమాజంలో వారి దర్జా కాస్త పెరగగలదు, వారి జీవితాల్లో పరివర్తనం రాగలదు. మలమూత్రాలనెత్తే పనే అవనివ్వండి. అది అస్పృశ్యతకు కారణభూతమవవచ్చును. గాని అదొక జాతిని జన్మ జన్మాంతరాలుగ అంటరానిదానినిగా చేయజాలదు.

కొన్ని జాతులు సంకరజాతులని. అందుకే అది అస్పృశ్యజాతు లయినవని కొన్ని స్మృతులు ఘోషించినాయి. కాని యిది కేవలం నిరాధారమైన వాదం పరస్పరంగా నాలుగు వర్ణాల్లోనేగాదు, యథా తథంగా బైట సీమాంతప్రదేశాలనుంచి వచ్చిన జాతులతో సంకరం అంటే కల్తీగాని జాతులేవో, ఎవరయినా వేలెత్తి చూపగలరా ?

చాండాలురు. శ్వపాకుల (కుక్క మాంసం తినువారు)ను గురించి స్మృతికారుడు మనువు యిలా శాసించాడు :— "ఈ అంత్యజులిరువురూ గ్రామాల వెలుపల నుండవలెను. కుక్కలు, గాడిదలను మించిన సంపద వీరికుండకూడదు." (10-51)

"కట్టడానికి శవాలమీద కప్పు వస్త్రాలు, తినడానికి కుండబోరిపెలే వాడాలి, నల్లని ఇనుప నగలు తప్ప యితర నగలు వీరు ధరించరాదు.

దా వీరు తిరుగుతూ వుండవలసినదేగాని ఒకచోట స్థిరనివాసం చేయ
దు.'' (10-52)

''ధార్మిక కార్యాలు చేయు వ్యక్తి వారితో ఎంతమాత్రమూ
సఖ్యం పెట్టుకోరాదు. వివాహం మొదలైన వ్యవహారాలు తన జాతి
వారలలోనే చేసుకోవాలి.'' (10-53)

''రాజు ఫర్మానా పొందితేనేగాని వీరు పగటిపూట పనులు
చేసుకోరాదు. దిక్కుమొక్కు లేనివారి శవాలను వీరు తప్పనిసరిగ
మోయాలి.'' (10-55)

''రాజంగీకరించిన దండనీతి ప్రకారంగా ప్రాణదండన పొందిన
అపరాధులను యీ అంత్యజులే వధించాలి. ఆ అపరాధుల శరీరాలమీద
వున్న బట్టలు, ఆ భూషణాలు వీరు తీసుకోవచ్చును.'' (10-56)

మనుమహారాజు యీ నియమాలు చాండాలుర, శ్వపాకులకొరకే
శాసించాడు. ఇవి అత్యంత ఘృణిత కార్యాలవడంవల్ల వీరిని గ్రామాల
వెలుపల ఉండమన్నారు, లేక అలా ఉండడం తప్ప వేరే గతి లేకుండా
చేశారు. ఇందుకే ధార్మికానుష్ఠానాలు నిర్వర్తించు వ్యక్తులు వీరిని
సమీపానికి రావద్దన్నారు. ఒకవేళ వస్తే, వారపవిత్రులైపోతారు. అలా
అపవిత్రులైనవారు స్నానజపాదులు చేసుకుని మరలపవిత్రులయ్యే
ఉపాయాలు కూడ ఉన్నాయి. దీనివలన కాస్త ఎడగాపుతనం ఉన్న
మాట నిజమేగాని, తరువాత దృఢపడినంత అస్పృశ్యత లేదు. అపవిత్రతను
సాకుగ తీసుకొని కేవలం యీ రెండు జాతులనే గ్రామాల వెలుప

వలసినదే. మలమూత్రాదులు పరిశుభ్రపరిచేవారిపట్ల యీలాంటి అనుచిత వ్యవహార మెక్కడా జరగడంలేదు. ఇటువంటి కొన్ని దేశాలు అంబేద్కారు దృష్టిలో వుండవచ్చునేమో ? కాని యిక్కడ ఆ హేయ వృత్తి విడిచిపుచ్చిన తరువాత కూడా అస్పృశ్యుడు స్పృశ్యుడుగా అవడం లేదే ? అయినప్పటికీ యీ పనులు విడిచిపుచ్చడంవలన — నెమ్మదిగానే అనండి — సమాజంలో వారి దర్జా కాస్త పెరగగలదు, వారి జీవితాల్లో పరివర్తనం రాగలదు. మలమూత్రాలనెత్తే పనే అవనివ్వండి. అది అస్పృశ్యతకు కారణభూతమవవచ్చును. గాని అదొక జాతిని జన్మ జన్మాంతరాలుగ అంటరానిదానినిగా చేయజాలదు.

కొన్ని జాతులు సంకరజాతులని. అందుకే అది అస్పృశ్యజాతు లయినవని కొన్ని స్మృతులు ఘోషించినాయి. కాని యిది కేవలం నిరాధారమైన వాదం పరస్పరంగా నాలుగు వర్ణాల్లోనేగాదు, యథా తథంగా బైట సీమాంతప్రదేశాలనుంచి వచ్చిన జాతులతో సంకరం అంటే కల్తీగాని జాతులేవో, ఎవరయినా వేలెత్తి చూపగలరా ?

చాండాలురు. శ్వపాకుల (కుక్క మాంసం తినువారు)ను గురించి స్మృతికారుడు మనువు యిలా శాసించాడు :— "ఈ అంత్యజులిరువురూ గ్రామాల వెలుపల నుండవలెను. కుక్కలు, గాడిదలను మించిన సంపద వీరికుండకూడదు." (10-51)

"కట్టడానికి శవాలమీద కప్పు వస్త్రాలు, తినడానికి కుండబొరిసెలే వాడాలి, నల్లని ఇనుప నగలు తప్ప యితర నగలు వీరు ధరించరాదు.

సదా వీరు తిరుగుతూ వుండవలసినదేగాని ఒకచోట స్థిరనివాసం చేయ రాదు.'' (10-52)

''ధార్మిక కార్యాలు చేయు వ్యక్తి వారితో ఎంతమాత్రమూ జోక్యం పెట్టుకోరాదు. వివాహం మొదలైన వ్యవహారాలు తన జాతి వారలలోనే చేసుకోవాలి.'' (10-53)

''రాజు ఫర్మానా పొందితేనేగాని వీరు పగటిపూట పనులు చేసుకోరాదు. దిక్కు మొక్కు లేనివారి శవాలను వీరు తప్పనిసరిగ మోయాలి.'' (10-55)

''రాజంగీకరించిన దండనీతి ప్రకారంగా ప్రాణదండన పొందిన అపరాధులను యీ అంత్యజులే వధించాలి. ఆ అపరాధుల శరీరాలమీద వున్న బట్టలు, ఆ భూషణాలు వీరు తీసుకోవచ్చును.'' (10-56)

మనుమహారాజు యీ నియమాలు చాండాలుర, శ్వపాకులకొరకే శాసించాడు. ఇవి అత్యంత ఘృణిత కార్యాలవడంవల్ల వీరిని గ్రామాల వెలుపల ఉండమన్నారు, లేక అలా ఉండడం తప్ప వేరే గతి లేకుండా చేశారు. ఇందుకే ధార్మికానుష్ఠానాలు నిర్వర్తించు వ్యక్తులు వీరిని సమీపానికి రావద్దన్నారు. ఒకవేళ వస్తే, వారపవిత్రులైపోతారు. అలా అపవిత్రులైనవారు స్నానజపాదులు చేసుకుని మరలపవిత్రులయే ఉపాయాలు కూడ ఉన్నాయి. దీనివలన కొంత ఎడగాపుతనం ఉన్న మాట నిజమేగాని, తరువాత దృఢపడినంత అస్పృశ్యత లేదు. అపవిత్రతను సాకుగ తీసుకొని కేవలం యీ రెండు జాతులనే గ్రామాల వెలుపల

ఉండమన్నారుగాని, వందలకొలది జాతులను వంశపరంపరగ అస్పృశ్యులుగ ఉండమనలేదుగా ? ఐనప్పటికీ చాండాలుర, శ్వపాకులమీద శాసించబడిన కఠిన ఆంక్షలు క్రమక్రమంగా సడలించబడ్డాయి. అంత్యజులు రాజ దర్బారుల్లో కూడా పాల్గొన్న ఉదాహరణ లవుపడుతున్నాయి.

మొదట్లోనే మన మనుకున్నాం, అపవిత్రత, అస్పృశ్యత వేరు వేరని. కాని రానురాను దళగత ద్వేషభావంవల్ల అపవిత్రతకే అస్పృశ్యత అంటగట్టారు. అదే విషయం కాలక్రమంలో "ఫలాని జాతి పరిశుభ్రతగ వుండడంలేదు గనక అది అస్పృశ్య జాతి" అనడం వాడుకై పోయింది. ఎడంగా వుండడంవల్లను, శుచిశుభ్రతగ వుండడానికి తగిన సాధనలోపంవల్లను, కొందరి దైనిక జీవిత వ్యవహారాల్లోనూ, ఉనికిలోనూ కొంత ఎబ్బెసితనం, అశుభ్రత రావడాని కవకాశాలు లేక పోలేదు. ఉచ్చకులాలనుకునే అనేకమందిలో యీ అనాచారాలు, అశుభ్రత కనపడుతున్నది. మరి వారినందర్నీ అస్పృశ్యులుగ ఎన్నుతున్నామా ? హీనభావంతో చూస్తున్నామా ?

కడకు తేలిన సారాంశమేమనగా అస్పృశ్యత అశుభ్రతనుంచి పుట్టలేదు, అస్పృశ్యతనుండే అశుభ్రత జన్మించింది. అసలీ రెండింటికీ మూలకారణం 'నన్ను ముట్టుకోకు నా మాలకాకి' అనే భావం, దళగత ద్వేషభావం తప్ప మరేమీ కాదు.

డా॥ అంబేద్కర్ ఈ విషయంలో ఓ కొత్త సిద్ధాంతం కని పెట్టారు. ఆయన అభిప్రాయం ప్రకారం "అస్పృశ్యత ఉత్పత్తికి రెండే కారణాలు. ఒకటి బౌద్ధమతంనుంచి చెదిరిపోయినవారిపట్ల

బ్రాహ్మణులకు గల ద్వేషభావం, రెండు ఆ బౌద్ధులు గొడ్డుమాంసం తినడం.''

''ఈ అంటరానితనం పుట్టకపూర్వం హిందువులకూ, అస్పృశ్యులకూ గల తారతమ్యం ఏపాటిదంటే, ఒక దళంవారికీ, మరొక దళంనుంచి చెదిరిపోయినవారికీ మధ్య గల తారతమ్యంలాంటిదే. ఆ చెదిరిపోయిన వారే రానురాను హరిజనులుగ పరిగణింపబడ్డారు.''

వైదిక యుగంలో అస్పృశ్యత లేదు. సూత్ర గ్రంథాల రచనా కాలంలో కూడా దీనిని గురించి దాఖలాలు లేవు. కాని అశుభ్రతను గురించి మాత్రం చెప్పబడివుంది. ఈ సంగతి అందరికి తెలిసినదే. అస్పృశ్యత బహుశా నాలుగవ శతాబ్దంలోనూ లేనట్టే. కాని ఐదవ శతాబ్దంలో ఉన్నట్టు నిదర్శనాలు కనుపిస్తున్నాయి. అవి సరిగ్గా బౌద్ధ మతం క్షీణిస్తున్న కాలం, బ్రాహ్మణమతం పునర్జాగరణ చెందుతున్న కాలం. ఏమే కారణాలచేత నయితేనేమి, బౌద్ధమతంపట్ల హీనభావం, ద్వేషభావాలు వ్యాపించసాగాయి. 'బౌద్ధు'ని, 'పాశుపతు'ని, 'లోకాయతు'ని, నాస్తికుని, మహాపాతకిని ముట్టుకుంటే మైలపడిపోతామనే భావం అప్పటికే ప్రబలమైపోయింది. కాని స్నానంవల్ల ఆ దోషం నివారణమయిపోయేది. 'హరిత' అనే ఒక వృద్ధుడు బౌద్ధమందిరాల్లోకి వెళ్ళడమే మహాపాపమన్నాడు. అప్పట్లో ఖాద్యపదార్థాలకు కరువు ఏర్పడడంవలన చెదిరిపోయిన బౌద్ధులూ, యుద్ధాల్లో ఓడిపోయినవారితో సహా కొందరూ బహుశా గొడ్డుమాంసం తింటే తినివుండవచ్చును. నేడు కూడా గొడ్డుమాంసం తినే జాతులు లేకపోలేదు.

ఈ వాదం సబబయినది, బలమయినదీను. కనుక దీన్ని ఉపేక్షించరాదు. ఈ విషయంలో ఇంకా పరిశోధన చేయడం ఎంతో అవసరం, అత్యంతావశ్యకం.

## అస్పృశ్యుల లక్షణాలు

1910 సం॥ నాటి జనాభా లెక్కల కమిషనరు ఒక నూతన వర్గీకరణం చేశారు. మతాలవారీగా జనాభా లెక్క వేయడానికి బదులు హిందువులను మూడు వర్గాలుగ విభజించారాయన. ఒకటి హిందువులు, రెండు ఆదివాసులు, మూడు అస్పృశ్యులు. ఆ విభజన ప్రకారం హరిజనుల లక్షణాలివి :—

1. ఏదో ఒక బ్రాహ్మణునిచేతనో, లేక హిందువుల కుల గురువులచేతనో దీక్షపొందనివారు.

2. సనాతన బ్రాహ్మణులు పౌరోహిత్యం చేయనిచ్చగించనివారు.

3. ఏ శాఖ బ్రాహ్మణులనూ పురోహితులుగా పెట్టుకోనివారు.

4. హిందువుల దేవాలయాల్లో ప్రవేశార్హత లేనివారు.

5. స్పర్శవలన లేక ఒక నిశ్చిత దూరం లోపల ప్రవేశించుటవలన యితరులను మైలపరచువారు.

6. గోమాంస భక్షకులు.

ఈ లక్షణాలు బహువ్యాపకమైనవి. అయినప్పటికీ కాలప్రవాహం వల్లనైతేనేమి. సంఘ సంస్కర్తల ప్రయాస ఫలితంగా నైతేనేమి వీటిలో

కొన్ని సడలింపులు కూడ ఏర్పడసాగినయి. అస్పృశ్యతను ధృవపరచ డానికి మూలకారణాలుగా యీ గీటురాళ్ళను ఉదాహరణలుగా తీసుకోవచ్చు నన్నారు.

హరిజనులపైన విధించబడిన సామాజిక ప్రతిబంధకాలకు ముఖ్య కారణాలు రెండని నిస్సందేహంగా చెప్పవచ్చును :— (1) సమాజానికి దూరంగా ఉండడం, (2) సమాజానికి వారిపట్ల గల హీనతాభావం, అసహిష్ణుత.

చివరకు ఇలా పర్యవసానం తేల్చుకోవచ్చును :—

1. వైదిక కాలంలో అస్పృశ్యత లేదు.

2. అన్త్యజ, అన్త్య, బాహ్య ఆదిగాగల శబ్దాల తాత్పర్యం 'అస్పృశ్యత' అని ఎక్కడా తెలియరావడంలేదు సరిగదా యీ శబ్దాంతర్గతంలో స్మృతులు, సూత్ర గ్రంథాల ద్వారా సమావేశపరచిన జాతుల వ్యాఖ్యలు పరస్పర భిన్నంగా ఉన్నాయి.

3. అస్పృశ్యులుగ ఎన్నబడిన జాతులు ఆర్యసంతతికి చెందినవే గాని మరి యే యితర సంతతికి చెందినవి కావు.

4. వర్ణ, జాతుల దుష్పరిణామం, ఉచ్చనీచభావన, వంటరితనం, అశుభ్రత.

5. బహుశా ఐదవ శతాబ్దంలోనే అస్పృశ్యత ఆవిర్భవించి ఉండవచ్చును.

ఇంతకూ అనేక జాతులను జన్మం మొదలు మరణ పర్యంతం అంటరానివారుగ పరిగణించడంలాంటి సందర్భం ఒక్క మనదేశంలో తప్ప ఇతర దేశాల్లో యెక్కడా లేదన్న సంగతి అందరికీ తెలిసినదే. అయితే యిక మనకు మిగిలిన ప్రశ్న యేమంటే యీ సాంఘిక అవినీతినీ, అన్యాయాలన్నీ కుక్కిన పేనులా మౌనంగా సహించి పూరు కోవలసిందేనా ? ఈ అమానుషిక వ్యవహారాన్ని తప్పకుండా ప్రతిఘ టించాలని, యిది సహించరాని అత్యాచారమని యెవరూ వేలెత్తి చూప లేదా ? చూపకేమి; అనేకమంది వ్యతిరేకించారు. ఈ సామాజిక అన్యా యంతోపాటు, సామూహిక నివారణ యత్నాలు కూడా నిరంతరాయంగా జరుగుతూనే వస్తున్నాయి. అనేకమంది ప్రవక్తలు, మహాత్ములు, యీ అస్పృశ్యతనూ, ఉచ్చనీచ భావాలనూ వాటి పుట్టుకనుంచీ ఖండిస్తూనే వస్తున్నారు.

# 2

ఏదేనా ఒక కొత్త జబ్బు పుట్టి ప్రచారం అవసాగిందంటే దాని విరుగుడుకూడ దాని వెన్నంటే ఉంటుంది. ఈ నియమం ఒక్క శారీరక రోగాలకే కాదు మానసిక రోగాలకుకూడా వర్తిస్తుంది. ఆదిలో మానవులు ప్రకృతికెంతో సమీపంగా వుండేవారు. అందుచేత వారెంతో ఆరోగ్యవంతులుగా వుండేవారు. నేడో ప్రకృతికి దూరమయ్యారు, అవుతున్నారు. కనుక నిత్యమూ కొత్త కొత్త రోగాలకు గురవుతున్నారు. ఈ జబ్బులకు కారణాలయ్యే కీటాణువులు వ్యాపించేకొలదీ వాటి నిర్మూల నోపాయాలు కూడా పుట్టకపోలేదు. శారీరక రోగాలతో సతమతమవుతుండే మానవులకు ఘటంతో ఎదురయ్యాడు ధన్వంతరి, యుక్తాయుక్త ఆహార విహారాలనే అమృతంతో నిండివుంది ఆ ఘటం. ఇంకొకవైపున రాగ ద్వేషాది మానసిక రోగాలతో పీడితులవుతున్న మానవులకు మంత్ర ద్రష్టలయిన ఋషులు తమ అంతర్ఘటంలోని అమృతాన్ని పానం చేయించారు :

"మా భ్రాతా భ్రాత రంద్విక్షన్ మా స్వసారం ఉత్ స్వసా,
సామ్యంచః సవ్రతా భూత్వా వాచం వదత్ భద్రయా."

అంటే అన్నదమ్ములు, అక్క చెల్లెండ్రెప్పుడూ ఒకరినొకరు ద్వేషించుకోరాదు. అంతా సమాన భావంతో, సమాన వ్యవహార నియమాలతో వుంటూ మంగళకరంగాను, భద్రంగాను సంభాషించుకోవాలి.

హిందూ సమాజంలో భయంకరమైన మానసిక వ్యాధి వ్యాపించింది. ఆ వ్యాధే 'అస్పృశ్యత'. అది అనేక మానవ సమూహాల్లో పరస్పర ఉచ్చ నీచ భావాలను పుట్టించింది. మరికొన్ని సమూహాల్లో వ్యక్తులనేకాదు సరికదా వారి నీడను సైతం తాకరాదని నిషేధించింది. ఇంతటితో ఊరుకున్నా సరిపోయేది. ఊరుకోలేదు. పూర్వ జన్మాన్ని కూడ యీడ్చుకొచ్చింది. అంటే పూర్వ జన్మలో సత్కర్మను చేసినవారు బ్రాహ్మణులుగాను, దుష్కర్మ లాచరించినవారు శూద్రులుగను, అస్పృశ్యులుగను పుట్టారని నిర్ణయించింది. ఈ అంటువ్యాధికి అనేకమయిన చికిత్సల వర్ణనలు మన ప్రాచీన ఉపఖ్యానాల్లో కోకొల్లలుగ కనుపిస్తున్నాయి.

## చండాలరాజు త్రిశంకుడు

త్రిశంకుడనే చండాలుడొకడు గంగా తీరాన నివసిస్తుండేవాడు. పదివేల చండాలుర కతడు పెద్ద, కులనాయకుడు. అంటే వారల కతడు రాజులాంటివాడన్నమాట. అతడు వేదాలు, స్మృతులు చక్కగా చదువుకున్నవాడు. శార్దూల కర్ణుడని అతని కొక కొడుకు. తనకు తెలిసిన విద్యలన్నీ కుమారునికి నేర్పాడు త్రిశంకుడు. తండ్రికి తగిన కొడుకవడం వలన అన్ని విద్యల్లోనూ పారంగతుడయ్యాడు శార్దూలకర్ణుడు.

వారికి సమీపంగా ఒకచోట ''పుష్కరసరి'' అనే బ్రాహ్మణుడు తన ఏకైక పుత్రికతో సహా నివసించేవాడు. ఆమె అనేక శాస్త్రాలు చదివివ, కళలభ్యసించిన విదుషి. ఆ అమ్మాయికి, శార్దూలకర్ణునికి

అన్నివిధాల ఈడూ జోడూ కుదిరిందని త్రిశంకునికి తట్టింది. తట్టినదే తడవుగా మరునాటి ఉదయమే చక్కగా ముస్తాబయి, మందిమార్బలంతో పుష్కరసిరి ఇల్లు చేరుకున్నాడు త్రిశంకుడు. త్రిశంకుని ఉచిత స్వాగత సత్కారాలతో సన్మానించాడు పుష్కరసిరి. కాని త్రిశంకుని ద్వారా తన కుమార్తె ప్రస్తావన వినడంతోనే క్రోధావేశుడై "ఒరే చండాలుడా! నీ కుమారునికొరకు బ్రాహ్మణ కన్యను కోరడానికి నీకు నోరెట్లా వచ్చిందిరా?" అన్నాడా బ్రాహ్మణుడు. ఈ ప్రసంగం నెపంగా ఆ బ్రాహ్మణ, చండాలుర మధ్య పెద్ద వాదవివాదం నడిచింది.

త్రిశంకుడిలా అన్నాడు :—

"బూడిద–సువర్ణాల మధ్య కనపడే తారతమ్య భేదం బ్రాహ్మణ, చండాలుర మధ్య అవుపడదే?"

"రెండు కర్రల రాపిడిచేత అగ్ని పుడుతుంది. బ్రాహ్మణుడు అలా పుట్టలేదే! ఆకాశంనుంచీ ఊడిపడలేదు. వాయువుకీ పుట్టలేదు. పోనీయండి భూమిని పెగల్చుకొని పుట్టాడా? అదీ లేదు. బ్రాహ్మణుడు మాతృగర్భంనుంచి ఎలా పుట్టాడో సరిగ్గా అదే విధంగా చండాలుడనేవాడు మాతృగర్భంనుంచే పుట్టాడు గదా! మరి వీరిలో భేదమెక్కడ?"

"ప్రాణం పోయిన తరువాత బ్రాహ్మణుని శవమెంత అపవిత్ర మవుతుందో చండాలుని శవం కూడా అంతే అపవిత్రమవుతుంది. ఇంతవర కిరువురూ సమానమే."

"బ్రాహ్మణులు యజ్ఞాల్లో పశువులనెంతో క్రూరంగా వధిస్తుం టారు. ఇందుకు వారేమి చెబుతుంటారంటే, మేకలు మొదలైన బలి

పశువులు మా మంత్రాల ప్రభావంవలన తిన్నగ స్వర్గం చేరుకుంటాయి. నిజానికిదే స్వర్గానికి దగ్గిర దారయితే వారు తమ తల్లిదండ్రులాదిగాగల స్వజనులను యిలాంటి ఋజుమార్గం ద్వారా స్వర్గానికేల పంపించరు?''

''బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులనేవి పేర్లు మాత్రమే. పాదం, తొడ, గోరు, మాంసం, పక్కటెముక మొదలైన అవయవాలు శరీరధారులందరకు సమానమే. ఎవరికి ఏ అవయవంలోనూ భేదమువుపడదు. ఇదేవిధంగా వేరువేరు విధాలైన వర్ణాలుండనేరవు.''

''చిన్నపిల్లలు ఇసుకపుంతల్లో ఆడుకుంటూ ఇసుకను కొన్ని కుప్పలుగా పోసి ఇది నీళ్ళు, ఇది పాలు, ఇది నెయ్యి, ఇది రొట్టె అని పేర్లు పెట్టుకుంటారు. అంతమాత్రాన ఆ ఇసుక కుప్పలు నిజమైన నీళ్ళు, పాలు, నెయ్యి, రొట్టెలవుతాయా? అవవు. అవి కేవలం నామభేదాలు మాత్రమే. అలానే బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులనేవి నామ భేదాలే కానీ వేరువేరు జాతులు కావు.''

''ఆవు, గుఱ్ఱము, ఏనుగు మొదలైన పశువుల భేదాలు స్పష్టం గనుక వాటిని మనం వేరువేరు జాతులకు చెందిన పశువులంటున్నాం. ఇదే మోస్తరుగా మామిడిపండు, అరటిపండు, ఖర్జూరపుపండు విభిన్న జాతులకు చెందిన పండ్లంటున్నాం. కాని బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రుల రూపాలలోను, అవయవాలలోను ఏ విధమైన భేదాలూ కనపడడం లేదు. కాబట్టి వీరు వేరు జాతులకు చెందినవారు కారని విదితమవుతుంది.''

''బ్రాహ్మణుల సంతానం బ్రాహ్మణులవుతారు. క్షత్రియుల

సంతానం క్షత్రియులే అవుతారనే సిద్ధాంతమే వేదసమ్మతమైనదైతే ఆ జాతి పరమైన గుర్తులు కొన్ని వారి పుట్టుకనుండి ఉండవలసింది.

హలము పట్టెడివారు కృషీవలురు.

వర్తకము చేయువారు వ్యాపారులు.

ఇళ్ళువాకిళ్ళు, భార్యాబిడ్డల్ని త్యజించి సన్యసించినవారిని పరివ్రాజకులంటారు.

తమ సదాచారం, పవిత్ర ఆచరణం ద్వారా ప్రజలను ప్రసన్నులుగా జేసేవారిని, ప్రజలను రంజింపజేసేవారిని రాజులంటారు.

కాని శారీరక రూపురేఖల్లో వీరందరిది ఒకే తీరు కనుక వీరు భిన్నభిన్న జాతులకు చెందిన వారెంతమాత్రం కారు.''1

## యథార్థమైన జవాబు

ఒకసారి కొంతమంది ఋషులు ''బ్రాహ్మణత్వం నిరూపించే మార్గమేమిటి?'' అనే విషయంపై దీర్ఘకాలం వాదవివాదాలు సలుపుతున్నారు. బ్రాహ్మణత్వమంటే 'వారి సంస్కారమా?' లేక 'వారి పవిత్ర ఆచరణా?' అనే నిర్ణయం వారిలో ఒక్కరూ చేయలేకపోయారు. ఆఖరికి ఒక వృద్ధ ఋషి సలహా ప్రకారం అంతా కలసి సమస్త సృష్టి కర్తయిన బ్రహ్మ దగ్గరకు వెళ్ళారు. బ్రహ్మదేవుడు వారి గద్దు

---

1. డా॥ రాజేంద్రలాల్ మిత్రాగారి రచన ''నేపాల్‌లో సంస్కృత బౌద్ధ సాహిత్యం''.

ప్రశ్నకు జవాబివ్వనెంచి వారిని ఇలా ఎదురుప్రశ్న వేశాడు. "మెడలో ఉన్న గంగడోలు 'సిలిగామ్'వి1 మామూలు ఆవులనుండి వేరుచేస్తున్నది గదా? అలాంటి జన్మతః వచ్చే గుర్తులేవేనా ఉన్నవేమో చెప్పండి బ్రాహ్మణ - బ్రాహ్మణేతరుల మధ్య?"

"లేదు పితృదేవా! అలాంటి గుర్తులు మే మెప్పుడూ చూడలేదు" అన్నారు ఋషిపుంగవులు.

బ్రహ్మ:—"ఇదేవిధంగా వేదం చదువుకున్నంతమాత్రాన ఎవరూ బ్రాహ్మణులు కాజాలరు. వేదపఠనం ఒక శిల్పకర్మ. మరొక ప్రశ్న అడుగుతాను. జవాబు చెప్పండి."

"మీరొక మనిషికి బ్రాహ్మణుడని, యింకొక మనిషికి శూద్రుడని పేరుపెట్టారనుకొండి. బ్రాహ్మణ శూద్రులిరువురూ సుఖదుఃఖానుభూతులను సమానంగానే అనుభవిస్తారా?"

ఋషులు:—"సుఖదుఃఖానుభూతులు యిరువురూ ఒకే మోస్తరుగా అనుభవిస్తారు."

బ్రహ్మ:—బ్రాహ్మణునికి వచ్చే క్షయవ్యాధి, శూద్రునికి కలిగే క్షయవ్యాధి ఒకటేనా లేక వేరువేరు క్షయవ్యాధులా?"

ఋషులు:—'ఇరువురికీ ఒకేరకమయిన రోగాలు వస్తాయి వట్టూ!'

---

1. చమరమృగం.

బ్రాహ్మ:—"భావాలో?"

ఋషులు:— "భావపరంపర కూడా యిరువురికి సమానమే స్వామి!"

మనిషికి మనిషికీ మధ్య భేదమేమీ లేదని గ్రహించారు ఋషులు కాని 'బ్రాహ్మణత్వమేమి?' అన్నవారి ప్రశ్నప్రశ్నగానే మిగిలి పోయింది. దానికి బ్రహ్మదేవుని జవాబిది:—

"నీర క్షీర న్యాయంగా మంచిచెడ్డలను. నీతి అవినీతిని వేరు చేయగలిగేవాడు బ్రాహ్మణుడు."

"సన్మార్గాన్నవలంబించి, దుర్మార్గాన్ని త్యజించినవాడు బ్రాహ్మణుడు."

"క్షమా, సజ్జనత, శమ, దమాలు సత్యం శుభ్రత, ధృతి, దయా, సంతోషం, అద్వేషం మొదలయిన సద్గుణాలు మీరు ఏ మనిషిలో నైతే చూడగలుగుతారో, ఆ మనిషి నిస్సంకోచంగా బ్రాహ్మణుడని భావించండి."

ఋషిపుంగవుల ప్రశ్నకు సరిఅయిన జవాబు లభించింది. వారి చిక్కు తీరిపోయింది.

## భేదమెక్కడా లేదే?

వర్ణవ్యవస్థాజనితాలయిన ఉచ్చనీచభావాలను వజ్రసూచికోపనిషత్తు యిలా ఖండించింది:-

వట, బకుళ, పలాశం, అశోకం, తమాల, నాగకేసర, సిరస, చంపకం మొదలైన వృక్షాల ఆకులు, పండ్లు, పువ్వులు, గింజలు, ఆఖరికి వీటి బెరడులు కూడా వివిధరకాలుగా ఉంటాయి. కనుక వీటిని వివిధ జాతులనడంలో అర్థమున్నది. ఇదేవిధంగ బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులు వివిధజాతులవారనడంలో అర్థంలేదు. ఎందుకంటే ఎముకలు, రక్తమాంసాలు, ఇంద్రియాలు ఆదిగాగల అవయవాలన్నీ నాలుగు వర్ణాలవారికి సమానమే అయినపుడు వారిని వేరువేరు జాతులవారనడం సరిఐ ఎలా అవుతుంది?

గూలర్, పనసచెట్లు, కొమ్మలకు, మానులకు, వేళ్ళకు కాయలు కాస్తాయి. కానీ వాటి ఆకారరూపురేఖలన్నీ సమానమే గనుక వాటిని వేరువేరు జాతులనలేము. చెట్టు పైభాగాన కాచినకాయ బ్రాహ్మణ కాయని, మధ్యభాగాన కాచిన కాయ క్షత్రియకాయని, క్రిందిభాగాన వేళ్ళలో కాచినకాయను శూద్రకాయని అంటామా? అనము. అదే విధంగ మానవమాత్రులంతా సమానమే. ఒకే తండ్రిబిడ్డలవలె వారిలో భేదం లేదు. (ఆచార్య అశ్వఘోషుని వజ్రసూచికోపనిషత్తు 17-18)

చండాలురు మొదలు బ్రాహ్మణునివరకు గల మానవ శరీరాలన్నీ పాంచభౌతికశరీరాలే వీరి జన్మ జరామరణాది ధర్మాల్లో సర్వత్రా సామ్యమే గోచరిస్తుంది. శ్వేతవర్ణంవారు బ్రాహ్మణులనీ, క్షత్రియులు రక్తవర్ణులనీ, వైశ్యులు పీతవర్ణులనీ, శూద్రులు కృష్ణవర్ణులనీ నియమం లెక్కడా లేవు.[1]

---

(1) వజ్రసూచికోపనిషత్‌నుంచి క్షితిమోహన సేను తన 'భారత దేశంలో వర్ణభేదాలు' అను పుస్తకంలో ఉటంకించారు.

భవిష్యత్పురాణం, బ్రహ్మపర్వంలోని 41, 42వ అధ్యాయాలు వర్ణ జాతి వ్యవస్థను తీవ్రంగా ఖండించాయి:—

ఒకేవిధమైన సాధనసామాగ్రితో, ఒకేరకమైన అనుష్ఠానంతో ఒక బ్రాహ్మణుడు, ఒక శూద్రుడు పూజింపబడుతున్నప్పుడు వారిరువురి బాహ్యభేదంగాని లేక ఆధ్యాత్మికభేదంగాని యెలా వుంటుంది?

దేవతలందరూ కలసి రేయింబవలు గాలించినప్పటికీ బ్రాహ్మణ శూద్రుల మధ్య తారతమ్యం కనుగొనలేరు.

బ్రాహ్మణులు చంద్రకిరణాల్లా శుక్లవర్ణులు కారు. క్షత్రియుల కింశుక పుష్పాల్లా ఎర్రనివారు కారు. వైశ్యులు హరతాలికవలే పసుపు వర్ణులు కారు. శూద్రులు నల్లటి బొగ్గులాంటివారు కారు.

నడక, శరీరం, వర్ణం, కేశాలు, సుఖదుఃఖాలు, చీమురక్తాలు, ఇవన్నీ సమస్త మానవులలోనూ సమానమే అయినప్పుడు నాలుగు వర్ణాలలో భేదమెక్కడ?

ఒకతండ్రికి కలిగిన నలుగురు కొడుకుల జాతి ఒకటే అయినట్లుగా సర్వమానవులకు పరమేశ్వరుడే తండ్రి.

## వృషలుడెవరు?

బుద్ధభగవానుని కాలంలో వృషలు (చండాలుడు)డు అస్పృశ్యుడుగాదు, కాని అతడంటే సమాజంలో కాస్త హీనభావమున్నమాట నిజం. బుద్ధుని దృష్టిలో జన్మ, జాతిరీత్యా ఒకడు వృషలుడు కాదు, ఇంకొకడు

బ్రాహ్మణుడు కాదు. బ్రాహ్మణునివలెనే వృషలుని గురించిన వ్యాఖ్య కూడా ఆయనదొకటున్నది. అదే సరయిన వ్యాఖ్య కూడాను.

ఒక కథ యిలావుంది. బుద్ధభగవాను డొకనాడు భిక్షాటన చేస్తూ చేస్తూ 'అగ్నికభారద్వాజుడ'నే బ్రాహ్మణుని గుమ్మం చేరుకున్నాడు. అప్పుడా బ్రాహ్మణుని ఇంటిలో అగ్ని ప్రజ్వలిస్తున్నది. హవన సామాగ్రింతా సిద్ధపరచబడివుంది. బుద్ధుడు రావడం చూచి ఆ బ్రాహ్మణుడిలా అన్నాడు:—'ముండకుడా! అక్కడే ఆగు. శ్రమణా! అక్కడే నిలువు. వృషలుడా! అక్కడే ఆగు.'

బుద్ధుడిలా ప్రశ్నించాడు. 'బ్రాహ్మణుడా! వృషలుడంటే ఎవరు? వృషలుడవడానికి కారణాలేమిటో నీకు తెలుసునా?'

'తెలియవు. వృషలుడంటే ఏవరో ఎరుగను. కారణాలసలే తెలియవు. కాస్త వివరించినట్లయితే తెలుసుకుంటాను.'

'అయితే విను, శ్రద్ధగా విను.'

'క్రోధితుడు, వైరి, పాపి, ఈర్ష్యాళువు, అసత్యవాది. మాయావి, అయినవాడు వృషలుడని తెలుసుకో.'

గ్రామాలను, నగరాలను ముట్టడించి నష్టపరచేవాడు, లోకకంటకుడని పేరు పడసినవాడు వృషలుడని తెలుసుకో.'

'గ్రామాలలోగాని వన్యప్రదేశాలలోగాని పరుల సంపత్తి నపహరించువాడు వృషలుడని గుర్తించుము.

'ఋణం తీసుకుని ఎగగొట్టేవాడు, తీసుకోలేదని బొంకేవాడు వృషలుడని గుర్తించుము.'

'తనకొరకు లేక ఇతరులకొరకై డబ్బుకాశపడి తప్పుడు సాక్ష్య మిచ్చువాడు వృషలుడని ఎరుగుము.'

'భయపెట్టో లేక ప్రేమ చూపో సంబంధీకుల స్త్రీలతోను, మిత్రుల స్త్రీలతోను కాలయాపన చేయువాడు వృషలుడుగా తలువుము.'

'సమర్థుడైయుండి కూడా వృద్ధులు వికలాంగులైన స్వజనులను, మాతాపితరులను పోషించనివాడు వృషలుడు.'

'సార్థక ప్రశ్నలకు అనర్థక జవాబులిచ్చువాడు, నాలికమడతల మాటలాడువాడు వృషలుడని యెరుంగనగును.'

'తాను పాపకర్మలు చేస్తూ, అవి యితరుల కంటబడకుండా కప్పి పుచ్చువాడు, పొరుగువారి కళ్ళల్లో దుమ్ముకొట్టి తన స్వార్థం నెరవేర్చు కొనేవాడు వృషలుడు.'

'మోహంలో పడి కామితార్థ వస్తువుల ప్రాప్తికొరకు అసత్య సహాయం పొందువాడు వృషలుడు.'

'తన పేరుప్రతిష్ఠలకొరకు పరనింద చేయువాడు, అభిమానం గలవాడు వృషలుడు.'

'జాతిపరంగాను, జన్మపరంగాను ఎవడూ వృషలుడు కానేరడు, బ్రాహ్మణుడూ కానేరడు. వృషలుడవడానికి, బ్రాహ్మణుడవడానికి కర్మే ప్రధానమైనది.' (బసలసుత్తం)

## అస్పృశ్యుడంటే ఎవరు?

అస్పృశ్యుడంటే ఎవరో చక్కగా వివరించాడు ఉడిపి (కర్ణాటకం)లో కనకదాసనే సుప్రసిద్ధ భక్తుడు. అతను కన్నడ భాషలో రచించిన కవిత్వానికి భావార్థమిది :—

'ఆరే మూర్ఖుడా! అంతదూరం నగరం వెలుపల నీవెందుకు వెదక బోతున్నావోయ్ అస్పృశ్యుణ్ణి?'

'కాస్త కండ్లు తెరచి చూస్తే నీకే అవుపడతాడు అస్పృశ్యుడు. నీ చెంతనేగా కూర్చున్నాడు వాడు.'

'కాదు, అస్పృశ్యుడంటే మరెవరో కాదు. తృష్ణను అధికంగా పోగుచేసుకున్నవాడు, పరులకు చిల్లిగవ్వయినా ఇవ్వనివాడు అస్పృశ్యుడు.'

'అస్పృశ్యుడంటే ఎవరనుకున్నావ్? అందరికంటే నేనే గొప్పని, నేనే ఉత్తముణ్ణని చాటుకునేవాడు అస్పృశ్యుడు.'

'అస్పృశ్యుడంటే ఇంకెవరో కాదు, అబద్ధాలాడేవాడే, ప్రతి నిత్యము పరుషభాషణలు చేసేవాడే అస్పృశ్యుడు.'

'పతితుడన్నా, అస్పృశ్యుడన్నా పరుల పాలిట హంతకుడే.'

'అటువంటప్పుడు అంతదూరం నగరం వెలుపల ఆ బస్తీల్లో అస్పృశ్యుణ్ణి నీవెందుకు వెదకబోతున్నావ్?'

'అతడు నీ సమీపంలో ఎక్కడా కనిపించడంలేదా?'

'ఋణం చేయుటెరుగునుగాని, ఆ ఋణం తీర్చుట ఎరుగనివాడే అస్పృశ్యుడు.'

'ఈ విధంగా అతడు నీకు, నీ దగ్గర కనిపిస్తుండగా అంతదూరం నగరం వెలుపల ఆ బస్తీలో ఎందుకు వెదకబోతున్నావు?'

'ఆడి తప్పేవాడు అస్పృశ్యుడు కాకపోతే మరెవరు చెప్పు?'

'ప్రతీ చోట, ప్రతీ నిత్యమూ స్వార్థసిద్ధికొరకు వేచియుండేవాడే అస్పృశ్యుడు.'

'బుద్ధిపూర్వకంగా, కావలెనని తన బలహీనతలను వెల్లడించనివాడే అస్పృశ్యుడు.'

'అస్పృశ్యుడనేవాడెపుడూ ఒక ఊరిలో పుట్టడు, నివశించడు. అతడు సదా, సర్వత్రా మనలనంటే ఉంటుంటాడు.'

## ఆచార్య శంకరుడు

గంగా తీరాన కాశీ నగరములో ఒకనాడు కొందరు శిష్యులతో శంకరాచార్యులు ఎక్కడికో వెళుతుండగా, మార్గమధ్యంలో ఒక అంత్యజుడెదురుపడ్డాడు. అతని నీడ కూడా తాకకుండా ఉండాలని ఆచార్య శంకరుడతణ్ణి 'దూరంగా తప్పుకో, దూరంగా తప్పుకో'మన్నాడు.

దానికా యంత్యజుడు పకపకా నవ్వి యిట్లా అన్నాడు :—

'నీవు అనేకమైన ఉపనిషత్తులు చదివావు. ఆ ఉపనిషత్తులు బ్రహ్మముని అద్వితీయునిగ, ఆనందమయునిగ, నిస్సంగ, సత్, చిత్,

ఆనందస్వరూపునిగా, భేదరహితునిగా నిరూపించాయి. మరి నీవు ఆ భేదంలో భేదం కల్పించడం చూస్తే ఆశ్చర్యంగా ఉందే?'

'అనేకమంది మానవులు సన్యాసుల వేషం ధరించి గృహస్థుల నిదేవిధంగా మోసగిస్తూ ఉంటారు. చంకలో దండం, చేతిలో కమండలం, కాషాయవస్త్రధారణం, వీటికితోడు నాలుగు వేదాంత వ్యాఖ్యానాలు నేర్చు కుంటారు. అంతే. వారిలో జ్ఞానం లేశమాత్రం కూడా ఉండదు.'

'ఆత్మకు సంబంధించినంతవరకు బ్రాహ్మణుడని, చండాలుడని నిర్ణయించడం నీలాంటి అద్వైతవాదికి తగని పని. దేవనది అయిన గంగా, మదిర (కల్లు) ఈ రెంటిమీద సరిసమానంగా ప్రసరించే సూర్య కిరణాలు వాటినెపుడేనా భేదభావంతో చూస్తున్నాయా? వాటి వాటి స్వభావాన్నిబట్టి సూర్యబింబం వేరువేరు రూపాల్లో అవుపడవచ్చును. కాని ఆ రెంటిమీదా ప్రసరించే సూర్యరశ్మి ఒకటే గదా?'

'నేను పవిత్రమైన బ్రాహ్మణుణ్ణి. నీవు చండాలుడవు. కనుక దూరంగా తొలగిపో అనే గదా నీ మతం! ఓ మునిపుంగవా! సమస్తమైన ప్రాణుల్లో సమాన రూపంగా నిహితమైవుండే ఆ అశరీరుణ్ణి, ఆ పూర్ణ పురుషుణ్ణి ఎందుకిలా ఉపేక్షిస్తున్నావు?'

ఒక చండాలుని ఉత్తమమైన అద్వైతజ్ఞానానికి ఆచార్య శంకరుడు నిరుత్తరుడయినాడు. వినయపూర్వకంగా ఆయన తల వంచేసుకున్నాడు. తన అజ్ఞానాన్ని అంగీకరిస్తూ ఆ చండాలునికి సాష్టాంగనమస్కారం చేశాడు.

## ఆచార్య రామానుజుడు

ఆచార్య రామానుజుని జీవితంలో చక్కని ప్రేరణాప్రదమైన ప్రసంగ మొకటున్నది. ఆచార్యు డొకనాడు శిష్యబృందంతో ఎక్కడికో వెళుతుండగా, దారిలో ఒక అంత్యజస్త్రీ ఎదురైంది. శిష్యులామెను దూరంగా తొలగిపొమ్మన్నారు. దాని కామె నవ్వి ఇలా అంది :—

''సమస్త భూమి భగవంతునిదే. ఇదంతా ఆయన మందిరమే గదా! మరి నే నెక్కడికి తొలగిపోను, ఏ విధంగ తొలగిపోను''

రామానుజాచార్యునికి కనివిప్పు కలిగినదీ మాటలకు పశ్చాత్తాప పడుతూ ఇలా అన్నాడు:—

'సోదరీ! నేనొక సన్యాసని. అయినప్పటికీ నాలో మిధ్యాభిమానం నిండిఉంది. నేను ధరించిన వైష్ణవగుర్తులున్నాయే, యివి నా కంటే నీ శరీరంమీద ఉంటే నే సార్థకంగ వుండేది.'

ఇంకో ప్రసంగం:— ఆచార్య రామానుజుడు తన వృద్ధాప్యంలో నదికి స్నానానికి వెళ్ళుతూ బ్రాహ్మణ శిష్యుని భుజసహాయంగా తీసుకునేవాడట. స్నానంచేసి తిరిగివచ్చేటప్పుడొక శూద్రుని భుజం సహాయంగా వచ్చేవాడట. ఇది చూచి కొందరు శిష్యులాయన్నిలా ప్రశ్నించారట:—'గురుదేవా! స్నానానికి వెళ్ళేటప్పుడు బ్రాహ్మణుని సహాయంతో వెడతారు. స్నానంచేసి పవిత్రులవుతారు గదా! అప్పుడు శూద్రస్పర్శ వర్జితం గాదా? తమరిలా ఎందుకు చేస్తున్నారు?'

రామానుజుకిలా జవాబిచ్చాడు:— 'నీచుడయిన శూద్రసపర్య ఎందుకు చేస్తున్నానంటే, నాలో గల కులీన జాత్యభిమానం పోగొట్ట దానికిదే తగిన ఉపాయం నాయీ అభిమానాన్ని స్నానజపాదులతో పోగొట్టలేను.

## భక్త కబీరు

అస్పృశ్యతను భక్త కబీరు కూడా తీవ్రంగా ఖండించాడు. చూడండి, కాశీలో ఒక పండాకు ఏలా కనువిప్పు కలిగిస్తున్నాడో:—

'అయ్యా! పాండేజీ! కాస్త అంతర్ముఖులై హృదయం తడవి చూచుకోండి,

కడకీ అంటరాని తన మెట్లా పుట్టిందోయ?

ఎక్కడో, ఎప్పుడో, ఏదోవిధంగా యిది పుట్టివుండాలి కదా?

కాబట్టే మీరు దీన్ని ఆచరిస్తున్నారు:

ఎనభై నాలుగువేల గర్భకుహరాల్లోనుండి పుడుతూ-చస్తూ ఈ దేహ పాత్ర కుళ్ళి కుళ్ళి, నశించి నశించి మట్టిగా మారుతూఉంటుంది.

ఈశ్వరుడందర్నీ ఒకే సానమీద కూర్చోబెట్టాడు.

ఐతే వీరిలో అంటరాని వారెవరో చెప్పండిమరి?

మట్టినుంచి మిగిలిందేమిటి? నీ భోజనమా, నీ జలమా?

నిజ చెప్పాలంటే యీ సృష్టే మట్టిలో పుట్టింది:

ఆ మట్టిలో కలవకుండా ఎవరైనా మిగిలారా?

అంటే కేవలం మాయకులోబడినవారే మిగిలారు.

ఆంధ్రప్రదేశంలో భక్తవేమన మాత్రం ఊరుకున్నాడా ? లేదు. చూడండి యే విధంగా ఖండిస్తున్నాడోను :—

““పుట్టినపుడెవరికేనా గాయిత్రి వుందా? ఉపవీతముందా? జంధ్యం లేని తల్లి శూద్ర స్త్రీయే గదా! ఐతే ఆమె కొడుకు బ్రాహ్మణుడెలా అయ్యాడు? కొబట్టి అంతా సమానమే. అందరూ సమానులే. అంతా సోదరులే. అందరూ ఒకే విధంగా పుట్టారు. అందరి రక్తమాంసాలు సమానమే, ఐనప్పుడు ఈ కొద్ది గొప్ప భేదాలు కల్పించు కోవడమెందులకు? ఒకే తల్లి బిడ్డల్లా కలిసి ఎందుకుండ కూడదు?''

## భక్తచోఖామేళుడు

మహారాష్ట్ర ప్రాంతంలో భక్తచోఖా మేళుడు కబీరు లాగానే ఆశ్చర్యపడుతున్నాడు, ““అందరి మానవుల శరీరాలొకేలాగున్నప్పుడు, అంతా సమానంగా పుట్టినప్పుడు ఈ కొద్ది గొప్ప భేదాలెలా వచ్చాయో?”' అని:—

““ఒకవేళ అంటునేదేవుంటే అది పంచ భూతాల్లో సమానంగానే వ్యాపించి వుంది. సృష్టి అంతటికీ వర్తిస్తుంది అది.''

అశుద్ధి శుద్ధి అనేవి ఎలా వచ్చాయి? ఒకవేళ అశుద్ధే అనుకుంటాం ఐతే దానికి మూలం శరీరమేగా ?

‘ఆదినుంచి అంతంవరకూ అపవిత్రతే, అపవిత్రత నిండివుండగా కడకీ అపవిత్రతంటే ఏమిటో ఎవరికీ తెలీదు.

'కనకకు ముట్టని మించినదేమిటయా అని ఆశ్చర్యపడుచున్నాడు భక్త చోఖామేళుడు.

## బసవేశ్వరుడు

సుప్రసిద్ధుడయిన బసవేశ్వరుడు కర్ణాటక ప్రదేశంలో తన సమకాలిక సాంఘిక మూఢ నమ్మకాలు, బంధనాలు, భేదించి. సమాజంలో గొప్ప విప్లవమే తీసుకొచ్చాడు. కేవలం మాటల్లోనే కాదు చేతల్లో కూడా ఆయన జాతిగతమైన ఉచ్చనీచ భేదాలు, అస్పృశ్యతను పాటించలేదు, ఆయన వీరశైవ సంప్రదాయ సంస్థాపకుడు. అంత్యజులే అనండి. బ్రాహ్మణులే అనండి మరెవరేనా కానీయండి శివభక్తులైన వారందరూ ఆయన దృష్టిలో సమానులే. భోజనపానాదుల్లోను, వైవాహిక సంబంధాల్లోను, కుల గోత్రాలను ఎంచుకోవడం ఆయన ఎన్నడూ అంగీకరించలేదు. మిధ్యావాదులు, ఢాంబికులు హింసాపరులైన వారే బసవేశ్వరుని దృష్టిలో అస్పృశ్యులంటేను.

వర్ణవ్యవస్థ, కులమత భేదాలు, అస్పృశ్యత కర్మకాండలు, వికట బంధనాలవించి సమాజాన్ని రక్షించడానికై బెంగాల్‌లో శ్రీ చైతన్య మహాప్రభువు, పంజాబులో గురునానక్ గురుగోవిందసింగు, ఆదిగాగల సిక్కు గురువులు. మహారాష్ట్రలో వారాకరీ సంప్రదాయానికి చెందిన సాధువులు, నామదేవు, తుకారామ్ ఏకనాథ్. జ్ఞానేశ్వరుడు మొదలైన మహాపురుషులుతమ తమ సమయాల్లో ప్రబల ప్రయత్నాలు చేశారు. వీరశైవ సంప్రదాయం కూడా కులమత బంధనాలను వీడనాడి సర్వ మానవ సమానత్వ సందేశాన్నందించింది.

# స్వామీ వివేకానందుడు

అస్పృశ్యత నివారణార్థం అంతవరకెవరూ చేయనంతటి గొప్ప ఉద్యమం స్వామీ వివేకానందుడు లేవదీశాడు. అస్పృశ్యత హిందూ ధర్మానికి పట్టిన కుష్ఠురోగమని, ఇది నశించనంతటివరకు ధర్మ సాధన చేయడం అసంభవమని ఆయన ఎలుగెత్తి చాటాడు, శంఖం పూరించాడు. ఆ శంఖధ్వని నేడు కూడా మన కర్ణ పుటాలలో ప్రతిధ్వనిస్తూనే వున్నది. అగ్నిస్ఫులింగాలవంటి వివేకానందుని వచనాలు నేడు కూడా మనకెంతో ప్రేరణాదాయకములు. చూడండి ఆయనేమంటున్నాడో :—

"మంచినీళ్ళు కుడి చేతితో తాగవలెనా లేక ఎడమ చేతితో తాగవలెనా అనే విషయం మీద శతాబ్దముల తరబడి వాదవివాదాలు సాగుతున్నదే దేశం మనది. ఆదేశీయులనుండి మనమేమాశించగలం? ఎంటయింటి ఆచారాలను గురించి అంతుపొంతు లేని తర్క వితర్కాలు సలుపుతున్న పండితులు, బుద్ధిజీవులున్న దేశదుర్గతి అంతకుమించి మరేముంటుంది? నన్ను నీవు ముట్టుకోవచ్చా లేక నిన్ను నేను తాకవచ్చునా లేదా? ఒకవేళ ఒండొరులం స్పర్శించుకున్నామే అనుకుందాం. ఐతే ఆ స్పర్శదోషానికి విరుగుడేమిటి? ప్రాయశ్చిత్తమేమిటి? అనే తెగని తర్కాలలో యుగ యుగాలుగా కొట్టుమిట్టాడుతున్న విజ్ఞానులు, విజ్ఞులు గల దేశాన్ని గురించి ఏం చెప్పుకోవాలి? "

" అన్ని అనర్థాలకు మూలం, మాయలో ముంచేది కులమతాల కల్పనే అన్న నాభావం రాను రాను దృఢమవుతున్నది. సమస్తమైన

జాతిభేదాలు— అవి జాతిగతమే అనండి, గుణ జనితమే అనండి— ఒక విధమైన బంధనాలే. కొందరు మిత్రులు నాకు సలహా ఇస్తున్నారు. ఏమంటే. "ఇది నిజమే కాని యీ సంగతి లోలోనే వుండ నివ్వండి, ఫై ట సాపేక్ష ప్రపంచంలో జాతిభేదం అవసరమే, బలహీనం, దుర్బల భావాలద్వారా ఎదోవిధంగాభావైక్యత మాత్రం మనస్సులో ఉంది కాని పైటమాత్రం నిర్దయ, అత్యాచారాల తాండవనృత్యాలు జరుగుతున్నవి."

"నేనే గనక 'పరియా' నయితే ఎంతో సంతోషించేవాణ్ణి. ఎందుకంటే "పరియా"ల యిళ్ళు పరిశుభ్ర పరిచిన బ్రాహ్మణుని శిష్యుణ్ణి నేను. ఆయన్ని పరియాలు అలా చేయనివ్వ లేదు. అందుకని ఆ మహాపురుష యూరకున్నాడా? ఒక అర్ధరాత్రివేళ లేచి ఎవరి కంట బడకండా పరియాల మరుగుదొడ్లని తన సుదీర్ఘమయిన కేశ జాలంతో పరిశుభ్ర పరచి తృప్తి పొందాడా మహాపురుషుడు. కించత్ కార్యం కొంత కబుర్ల పోగును మించిన విలువ గల దవుతుందిగదా!

"ఈశ్వరుడున్నాడా అన్నమాట నిజం కాని ఆయన దర్శనం కేవలం తమ ద్వారానే తప్ప అన్యథా అసంభవమని పురోహితుల విశ్వాసం. ప్రజలు ఆ పవిత్రుని చేరాలంటే కేవలం ఈ పురోహితుల ద్వారానే ప్రవేశం లభిస్తుంది. నీవతనికి లంచమివ్వు, కాకాబట్టు, చేయగల విన్నపాలన్నీ చేయి. ఐనా అతడు నీకు కొరుకుడు పడడు. "దేవుడు వరమిచ్చినా పూజారి వరమివ్వడని" సామెత ఉందిగదా! పురోహితులు నిన్ను కాపి స్తారు. సరళ సులభమైన సత్యాన్ని నీకు సూటిగా చూపరు. ద్రావిడ ప్రాణాయామంగా తిప్పి చూపుతారు. తమ ప్రతిభను, గొప్పను సమర్థించే కట్టుకథలు నీకు చెపుతారు. ఇది పురోహితుల ప్రభావం."

" పేదల, అనాథుల, అశ్రుధారలు తుడవని ధర్మం ధర్మమా? మానవునిలో దేవత్వ మాపాదింపని ధర్మమేమి ధర్మం? మన ధర్మమని చెప్పుకోదగినదని నీవు నమ్ముతావా? నన్ను ముట్టుకోకు 'నామాల కాకి' అనేదే మనధర్మం. నన్ను ముట్టవద్దు నన్ను ముట్ట వద్దు."

" భంగీలు, పరియా లనుభవిస్తుండే హీనస్థితికి, వారినీ పాల్జేసిన వారెవరు? ఒక ప్రక్క హృదయ రహితంగా అంటే నిర్దయగా వ్యవహరి స్తున్నాం. రెండవ ప్రక్క ఆశ్చర్యకరమైన అద్వైత వాదం ఉపదేశి స్తున్నాం. ఇది పుండుమీద కారం చల్లడం కాదా? "

'సమాజంలో నీవొక రాజ్యపాలకుడవు కావచ్చును, నేనొక చెప్పులు కుట్టుకునేవాణ్ణి కావచ్చును. ఇంతమాత్రాన నీవు నాకంటే గొప్ప వాడివెలా అవుతావు? చెప్పులు కుట్టడంలో నేను నేర్పరిని. నీవు వేద పఠనంలో నేర్పరివి. మనిరువురం సమాజోపకరమైన కార్యాలే చేస్తు న్నాము. ఐతే మనలో ఒకరు పెద్ద ఒకరు చిన్న అనుకోడానికి తావెక్కడ?'

'ఫలానివానితో కలసి భోజనం చేయవచ్చును. ఫలానావానితో చేయరాదు అనే అనిశ్చతభావమే మన భారతీయులకు మిగిలినదల్లా. కొన్ని వందలేండ్లకు పూర్వం కొన్ని నియమనిబంధనలు ఏర్పడ్డాయి. కాని అందులో నేడు మిగిలినది. 'స్పర్శ పవిత్రత' అంటే స్పర్శాస్పర వివేచన మాత్రమే.'

'మనమంతా సనాతన మతావలంబులమైన హిందువులం గాన అంటుకోవచ్చు, ముట్టుకోవచ్చునే వారితో మనం కలవ నిచ్చగించం. ఎందుకంటే అది మన హిందూధర్మంలో గాని, ధర్మగ్రంథాల్లో గాని వ్రాసిపెట్టలేదు గనుక, నిజానికిది మన జాతీయభావైక్యతకు అడుగడుగునా అడ్డువచ్చే కుసంస్కారమే సుమా!

'ఉత్తమమైన వేదాంత సిద్ధాంతాలెన్నో వున్నాయి మనకు. కాని వాటి కనుగుణమయి ఆచరణ లేశమైనా లేదు విశ్వవ్యాప్తమైన సామ్యభావ సిద్ధాంతం వ్రాసిపెట్టివుంది మన గ్రంథాల్లో. కాని దాని ప్రయోజనం శూన్యం. మన కార్యాలు, వ్యవహారాలు దానికి వ్యతిరేకం. సరిగదా గొప్ప భేదభావపూరితాలు కూడా. రక్తమజ్జామాంసాదులతో కూడుకొన్న ఈ భౌతికశరీరాన్ని విడిచి మరోవిషయం మాట్లాడలేము గదా?'

'నన్ను ముట్టుకోకు, నన్ను ముట్టుకోకు' అన్నదే మనలో రేయింబవలు జరిగే రగడ, మనం యెలుగెత్తి చాటే రణగోలాను. దేశీయుల హృదయాల్లో దయా, దయార్ద్రతలనేవి లేనేలేవు. ఈ మూఢనమ్మకాల నొక్కసారిగా హృదయాలనుంచి పారదోలాలి. వీరు వారననేల? కరకు నాలో కూడా సూర్యునివలె ప్రత్యక్షంగా ఆ పరబ్రహ్మ కనుపిస్తున్నాడు. ఒకే ఒకశక్తి, ఆ పరాశక్తి మనందరికోనూ విహితమైవుంది. కానైతే అభివ్యక్తి మాత్రం భేదించింది. శరీరాల్లో రక్తసంచారంలేని మానవులెప్పుడేనా పురోగమించ గలిగారా? ఒక అవయవం పక్షవాతంతో పడిపోయిందనుకుందాం, మిగతా అవయవాలు పరిపూర్ణంగా ఉన్నప్పటికి ఆ శరీరంతో మనం సంపూర్ణమైన పనిచేయగలమా?'

'సనాతనవాదుల' మమ్మల్ని ముట్టుకోవద్దు. మమ్మల్ని ముట్టుకోవద్దుఅనే అరుపులతో దేశం సేతుశీతనగపర్యంతం ప్రతిధ్వనించిపోతుంది. దీని పర్యవసానంగా దేశం రోజురోజుకీ పెద్ద అఖాతంలోకి దిగజారిపోతున్నది హిందూధర్మం కేవలం వంటయింటి ధర్మమే అయిపోయింది. ఉదాత్తము ఉత్కృష్టమైన ధర్మతత్వాన్ని ఓ ప్రక్కకు త్రోసివచ్చాం. మధుర రసభరిత మయిన దానిఫలాలను కూడా విడిచిపెట్టాం. కేవలం సారరహితమైన తొక్కలకోసం పోట్లాడుకుంటున్నాము.'

''సరేనయ్యా! మనకేధర్మ మిగిలిందంటారు? జ్ఞానభక్తి యోగ మార్గాలేనాడో ముగిసిపోయినవి. యిక మిగిలిందల్లా 'నన్నుముట్టుకోకన్న' ధర్మమే.'

రూఢిగ్రస్తసమాజం, కులమత భేదభంజకులైన భక్తులు, మహాత్ములు, ప్రవక్తలు కాలంచేసిన హెచ్చరికలను ఒక్కసారి కూడా ఖండించ లేదు, సరిగదా వాటికి స్వాగతవచనాలు కూడ పలకలేదు. ఎందుకైనా సమర్థులు, మహాపురుషులు, ప్రవక్తలూను. వారిసలహాల ఉపదేశాల ప్రకారం మనం నడచుకోగలమా. ఆచరించగలమా? వారికీ మనకీ సాటెక్కడ? అని యీసడించింది. పాముచావకుండాను, కర్రవిరగకుండాను నీళ్ళునప్పరించి ఊరుకుంది అంతే. నిజానికి భగవద్భక్తునికి—అతడు చండాలుడయినాసరె బ్రాహ్మణునికంటే గొప్ప స్థానం లభించింది. భగవద్భక్తుడుగాని బ్రాహ్మణునికి చండాలునికన్నా నిమ్నస్థానం లభించింది. కాని వ్యవహారరీత్యా దీనికి వ్యతిరేకంగా నడుస్తున్నది. బ్రాహ్మణుడు తనభగవద్భక్తుడు కాక పోయినా—పూజ్యుడవుతున్నాడు. మరి అస్పృశ్యుడో!భక్తుడనే నెపంతో

పూజ్యార్హుడవుతున్నాడు. పూర్వజన్మలో బ్రాహ్మణుడే అయివుండాలి. ఏవో పాపకర్మలాచరించబట్టి, ఈనాడు అస్పృశ్యుడుగ పుట్టగానే కల్పిత కథలు జోడిస్తున్నారు. సమతాభావాన్ని అన్ని సంప్రదాయాలవారు తమతమ సంప్రదాయాలవరకే వర్తింపజేసుకుంటున్నారు. ఒక వ్యక్తి అతడెంత సజ్జనుడు, సత్ప్రవర్తకుడైనప్పటికీ ఒక సంప్రదాయపు మర్యాదలో యిమడనియెడల తోటివారి సోదరభావానికి, సానుభూతులకు అర్హుడు కాలేకపోతున్నాడు. అస్పృశ్యత, కులమతాల నిర్మూలనార్థం సమాజంలో భక్తులు, ప్రవక్తలు, సంస్కర్తలు చేసిన ఉపదేశాలు, సలిపిన కార్యాల ప్రభావం మహాజరిగితే వారివారి అనుయాయులవరకే పోయిందిగాని అంతకు మించిన వ్యాపకరూపం దాల్చలేకపోయింది.



# 3

## గాంధీ యుగం

గాంధీ యుగం వచ్చింది. అస్పృశ్యతా నివారణ కార్యకలాపాలకు ప్రోత్సాహం కలిగింది. ఈ దశలో సాధువులు, సంఘ సంస్కర్తలు వేసిన కాలిబాట ఈ యుగంలో విశాలమైన రాజబాటయింది. సంస్కార కార్యాలు అతివేగంగా దేశం నలుమూలలా వ్యాపించాయి. సాంఘిక దురాచారాలనివారణకు తగిన వాతావరణం ఏర్పడింది. వీటికి వ్యతిరేకంగా ఛాందసవాదులయిన సనాతనుల ప్రతిక్రియ కూడా లేకపోలేదు. వీరు తమ తమ పక్షసమర్థనకు శృతిస్మృతుల ప్రమాణాలు ఏకరువుపెడుతూనే ఉన్నారు.

మహాత్మా గాంధీ భారతీయ రంగస్థలంమీద రాకపూర్వం పరస్పరం ప్రతికూలంగా ఉండే రెండు రకాలయిన భావాలు చలామణీలో ఉండేవి. ఒకటి—అస్పృశ్యతా నివారణ ద్వారా సంఘ సంస్కరణం చేయాలని; రెండు—దేశ దాస్యశృంఖలా విమోచనం ద్వారా సంఘ సంస్కరణ చేయాలని. ఈ రెండింటిలో దేనికి ప్రధానత యివ్వవలెనా అనే విషయం మీద తర్జభర్జనలు జరుగుతూండేవి. మొదటిదానికి ప్రతినిధి గోఖలే మహాశయుడయితే, రెండవదానికి జనకుడు తిలక్. దేశప్రేమలో యిరువురూ సమానులే. ఐనప్పటికీ అభివ్యక్తి మాత్రం భిన్నం గోపాలకృష్ణ గోఖలే సంఘ సంస్కరణ ప్రియుడైతే, లోకమాన్య బా

గంగాధర తిలక్ స్వరాజ్య పక్షపాతి. అంటే తిలక్ సంఘ సంస్కరణకు వ్యతిరేకుడని కాదు. ఆయన దృష్టిలో "అస్పృశ్యత వేదసమ్మతమైనది కాదు. పురోహితుల, సాంఘిక గుత్తదారుల అత్యాచారాల ద్వారా యిది పుట్టిపెరిగింది. అస్పృశ్యతకు ఏ విధమైన శాస్త్రాధారాలు లేవు. పరమ పిత పరమేశ్వరాలయంలో మీరూ, వారనే భేదం లేకుండా అందరూ ప్రవేశించవచ్చును. అంటే ఏ ఒక్కరికీ ప్రవేశార్హత లేని పక్షంలో అది పరమేశ్వరాలయమే కాదు." కాని దానికనేకరెట్లధికంగా ఆయనకు దేశదాస్యం సహించరాని సమస్య. ఈ భావద్వయాన్ని సమన్వయవరచడానికి వీరి మధ్య వచ్చి నిలబడ్డాడు మహాత్మా గాంధీజీ. గాంధీజీ సమన్వయ మార్గం ద్వారా స్వరాజ్య పోరాటానికి బలం చేకూరింది సరికదా। ఆ స్వరాజ్య సైనికుల్లో సంస్కరణాభిలాష కూడా జనించింది.

1921 నవంబరులో సత్యాగ్రహం ఆరంభించాలని కాంగ్రెసు నిర్ణయించింది. గాంధిజీ మార్గదర్శకత్వంలో జరగనున్న సత్యాగ్రహానికి గల షరతుల్లో ఒకటి, "సత్యాగ్రహంపట్ల నమ్మకంగల వ్యక్తి హిందువు డయితే, అతడు అస్పృశ్యత జాతీయతా భావానికి కళంకమని అంగీకరించి తీరాలి" తరువాత కాంగ్రెసు ద్వారా ఏర్పాటయిన స్వయంసేవకుల సంస్థలో సభ్యుడయిన ప్రతి వాలంటీరు క్రింది ప్రమాణం చేయవలసి వుండేది. 'అస్పృశ్యతను నిర్మూలించడం న్యాయసమ్మతమని, అనివార్య ధర్మమని నమ్ముతున్నాను. సాధ్యమైనంతవరకు హరిజనులతో వ్యక్తిగతంగా స్నేహం ఏర్పరచుకొని వారిసేవ చేస్తుంటాను.'

కలకత్తా కాంగ్రెసులో గాంధీజీ ప్రోత్సాహంతో దశసూత్రి కార్యక్రమం రూపొందింది. అందులో ఒక షరతు ఇది:—'కాంగ్రెసు

వాది అయిన ప్రతి ఒక్క హిందువుడి కర్తవ్యమేమంటే "అస్పృశ్యతా నివారణార్థం శక్తివంచన లేకుండా తాను పాటుపడాలి, అస్పృశ్యులు తమ అయోగ్యతను నిర్మూలించడానికి తాను చేయగల సహాయం చేయాలి." 1921 తరువాత స్వరాజ్యప్రాప్తి కొరకు కాంగ్రెసు రూపొందించి నడిపిన ప్రతి కార్యక్రమం గాంధీజీ సలహా సహకారాల ద్వారా నడచినదే. కనుక ఆ కార్యక్రమములన్నిటిలోను అస్పృశ్యతా నివారణ నిబంధన ఉంటూనే వచ్చింది.

అప్పట్లో యీ పద్ధతి ఒక అపోహకు కారణమయింది. ఇది అస్పృశ్యతా నిర్మూలన కాదని, ఇది కేవలం రాజనీతి పోలసీ అని అంతా అనుకోసాగారు. కాని అది పొరపాటభిప్రాయము. స్వరాజ్యాందోళనకు అస్పృశ్యతా నివారణ కార్యంవలన బలం చేకూరిన మాట వాస్తవమనే సంగతి వేరు; కేవలం రాజకీయ హేతువులనే గాంధిజీ యీ ప్రవృత్తి చేపట్టి నడుపుతున్నాడనేది వేరు విషయం. ధర్మం, సంఘం వీటి పరిశోధనవల్లనే—పరోక్షంగానే అనండి—రాజనీతికి బలం చేకూరగలదు, చేకూరింది కూడాను. అస్పృశ్యతా నివారణ — ముఖ్యంగా గాంధీజీ దృష్టిలో — ధర్మసంశోధనం, సంఘ సంస్కరణ కార్యమనడంలో సందేహంలేదు. గాంధిజీ దృష్టిలో రాజనీతి ధర్మానికి బానిస. అన్ని ప్రవృత్తులకూ పునాది ధర్మమేనని ఆయన భావిస్తుండేవాడు. ఈ తథ్యాన్ని నిరూపించడానికాయనిలా అన్నాడు:—"ధర్మంకోసం దేశాన్ని సహితం బలి యివ్వగలనని నా నమ్మకం. నా స్వదేశాభిమానం ధర్మాభిమానంతో పాటిదే. నా దేశ హితం, ధర్మహితానికి విరోధి అయినయెడల దేశ హితం విడనాడడానికి వెనుదీయను. అంత్యజులను అంటరానివారనడం

అధర్మమని నేను నమ్ముతున్నాను.'' కనుక అస్పృశ్యతా నివారణం, లేక దళితోద్ధరణం కార్యాల వెనక గాంధీజీకి ఏ విధమైన రాజకీయ స్వార్థం లేక ఉద్దేశ్యం లేదని సుస్పష్టం. రాజనైతిక జాగరణం దాని ఫలితార్థమే అవుతుందిగానీ హేతువెంతమాత్రమూ కానేరదు.

అంటరానితనం సాంఘిక దురాచారమని, పాపమని గాంధీజీ తన బాల్యదశ నాటినుండీ నమ్ముతున్నాడు. సుమారు పన్నెండేళ్ళ ప్రాయం నాడే ఈ భావ మాయన మానస పటలంమీద హత్తుకుపోయింది. 1921లో అహమ్మదాబాదులో జరిగిన దళిత జాతి సమ్మేళనంలో గాంధీజీ ఇలా చెప్పారు :—

''అప్పట్లో 'ఉకా' అనే పాకీ పిల్లవాడు మా మరుగుదొడ్డి శుభ్రం చేయడానికి వస్తుండేవాడు. అతన్ని ఎందుకు ముట్టుకోనివ్వరు? ముట్టుకుంటే వచ్చే పాపమేమిటి? మా అమ్మను అడుగుతుండేవాణ్ణి. పొరపాటున ఎపుడేన 'ఉకా'ను ముట్టుకుంటే నన్ను స్నానం చేయిస్తుండేవారు, సహజంగా పెద్దల ఆజ్ఞను పాలిస్తుండేవాణ్ణి. కాని తరువాత నవ్వుతూ అస్పృశ్యతను హిందూధర్మం అంగీకరించదు, అంగీకరించడం సంభవమని ప్రతిఘటించకుండా ఉండలేకపోయేవాణ్ణి. నేను ఎల్లప్పుడు తల్లిదండ్రుల ఆజ్ఞాపాలకుడిగా, కర్తవ్యపరాయణుడిగా ఉండేవాణ్ణి. కాని వారి గౌరవమర్యాదలను రక్షిస్తూ కూడా ఈ విషయంలో వారికీ, నాకూ మధ్య కాస్త విరోధం ఉంటూనేవుండేది 'ఉకా'ను ముట్టుకుంటే పాపం తగులుతుందనే నీ నమ్మకం సరయినది కాదని నేను ఒకసారి మా మ్మతో చెప్పాను.''

గాంధీజీలో అస్పృశ్యతంటే కిట్టని భావం ఆయన దక్షిణాఫ్రికాలో నడిపిన సత్యాగ్రహం రోజుల్లో మరీ తీవ్రమయింది.

దక్షిణాఫ్రికానుంచి తిరిగి వచ్చి అహమదాబాదులో 'కోచరబ్' అనే పేటలో ఆశ్రమం నెలకొల్పారు గాంధీజీ. అప్పుడాయన ఎప్పుడూ కని విని ఎరుగని పరీక్ష నెదుర్కొనవలసివచ్చింది.

తలవని తలంపుగా ఒకనాడు గాంధీజీకి శ్రీ అమృతలాల్ థక్కర్—థక్కరు బాబాగారి ఉత్తరం అందింది. అందిలా రాశారు :—"నిరుపేద లయి, దయకు పాత్రమైన ఒక అంత్యజ కుటుంబం ఆశ్రమంలో ఉండాలని కోరుకుంటుంది. రమ్మంటారా?" ఆశ్రమ ఆరంభకాలంలోనే ఇంత త్వరగా థక్కరు బాబావంటి వ్యక్తి ద్వారా ఒక అంత్యజ కుటుంబం ఆశ్రమంలో ప్రవేశిస్తుందని కలలోనైనా తలచలేదు గాంధీజీ. ఆ ఉత్తరం చూడడంతోనే ఆశ్రమవాసులు ఆ కుటుంబానికి స్వాగతం పలికారు. ఆశ్రమ నియమాల నంగీకరించిన ఆ అంత్యజ పరివారం ఆశ్రమంలో ప్రవేశించింది. ఆ పరివారమంటే దుదాభాయి, అతని భార్య, పాలు తాగే బిడ్డ లక్ష్మిని. ఈ ప్రసంగం తన ఆత్మకథలో యిలా రాసుకున్నారు గాంధీజీ :—

"దీనితో మా మిత్రమండలిలో అలజడి రేగింది. మేము నివసించే ఇంటి యజమాని నూతిలో నీళ్ళు తోడుకోనిచ్చేవాడు కాదు. నీళ్ళుతోడే ఆయన నౌకరుకు కూడా మేమా నూతిలో నీళ్ళు తోడ్డం నరిపడేది కాదు. దుదాభాయిని సదా వేధిస్తుందేవాడు. 'అతని తిట్లు మనందరం ఓర్పుతో సహించుకోవాలిగాని నీళ్ళు తోడడం మాత్రం మాన

రాదని' నేనందరికి చెప్పివుంచాను. చివరికి తన ప్రవర్తనకు ఆ నౌకరు లజ్జితుడయ్యాడు. మమ్మల్ని వేధించడం మానుకున్నాడు. కాని ఇంకో ప్రక్కనుంచి ఆశ్రమానికి లభిస్తుండే సహాయం నిలిచిపోయింది. నిష్ఠాపూర్వకంగా ఆశ్రమ నియమాలు పాటిస్తుంటే కొంతమందికి ఒక అంత్యజ కుటుంబం ఆశ్రమంలో ప్రవేశించడం ఆశ్చర్యం కలిగించింది. నెమ్మదినెమ్మదిగా అభ్యంతరం కలగసాగింది. దీని పర్యవసానం మమ్మ బహిష్కరించాలనే అపవాదులు కూడా వినబడసాగినాయి. నా అను యాయులకు ముందుగానే హెచ్చరిక చేసివుంచాను. 'మనల్ని బహిష్క రించినా సరే, మరే విధమైన సహాయం లభించకపోయినా సరే, మనం అహ్మదాబాదు విడవరాదు. అంతగా తప్పనిసరయితే, అంత్యజుల పేటలో వెళ్ళి ఉందాం. అక్కడ దొరికినదానితోనే కాలం గడుపుకుందాం. లేక కూలిపని చేసుకుని జీవిద్దాం.' వచ్చే నెలనుంచే మన ఖర్చుకు పైకం లేకపోతేనో? అనే ప్రశ్న పుట్టింది. అయితే మరీ మంచిది, త్వరగానే అంత్యజుల పేటలో వెళ్ళి ఉండవచ్చును. అని నా జవాబు.

అదృష్టవశాత్తు ఆలాంటి పరిస్థితి కలగలేదులెండి. మరునాడుదయమే ఒక అపరిచిత వ్యక్తి వచ్చి 13 వేల రూపాయల చెక్కు గాంధీజీ చేతిలో పెట్టి వెళ్ళిపోయాడు. ఇదొక కొత్తరకమైన సహాయం. దీనితో సుమారొక ఏడాదిపాటు ఖర్చు ఆశ్రమానికి లభించింది.

గాంధీజీ ఈ పరీక్షలో నెగ్గుదేరారు. నాటినుంచి ఆశ్రమంలో అస్పృశ్యతకు చోటులేకుండాపోయింది. సరిగదా దాని పునాదులు కూ కదలిపోయాయి. తరువాత ఏర్పడిన ద్వాదశ ఆశ్రమ నియమాల్లో

'అస్పృశ్యతా నివారణ' ఒక వ్రతంగా ఎన్నికయింది. గాంధీజీ ఈ వ్రతాన్నిలా వ్యాఖ్యానించారు :—

"అస్పృశ్యతా నివారణ వ్రతం, సరికొత్త వ్రతం. బహుశ కొందరికిది విచిత్రంగా తోచవచ్చును కూడా. కాని ఒక్క సంగతి— ఇది ఎంత విచిత్రమైనదో, అంత అవసరమైనదిగా తలవాలి. అస్పృశ్యత అంటే అంటరానితనం. ఇది ధర్మంపేరుతో లేక ధర్మం మిషతో ధర్మ మార్గంలో అడ్డు తగులుతుంటుంది. పవిత్రధర్మాన్ని కలుషితం చేస్తుం టుంది. ఒకే ఒక ఈశ్వరుడు, ఒకే ఒక ఆత్మ అని మనం అనుకుంటు న్నప్పుడు అంటరానితనం ఎక్కడనుండి వచ్చింది? అంటుకునే వా రెవరు? అంటుకోరాని వారెవరు? భంగీ, చమార్ అంటరానివారుగా ఎన్నబడ్డారు. కాని వీరు అస్పృశ్యులు కారే? నిర్జీవమైన దేహంకూడా అంటరానిది కాదు, సరిగదా ఆదరణ, కరుణలకు పాత్రమైనది. తల గొరిగి, నూనెరాసి, నలుగుపెట్టి శవాన్ని స్నానం చేయించిన తరువాత, ఆరోగ్య నియమాలు ననుసరించి స్నానంచేయడం ధర్మమే, ఒకవేళ స్నానంచేయలేదే అనుకోండి. అప్పుడతను అపవిత్రుడే అవుతాడుగాని పాపి, పతితుడు మాత్రం కాదుగదా! బిడ్డల మలమూత్రాలెత్తిన తల్లి స్నానం చేయనంతవరకు లేక కాళ్ళు, చేతులు చక్కగ శుభ్రపరచు కోనంతవరకు అంటరానిదే అనుకోవచ్చును. అంతమాత్రాన అటమరపున వచ్చి తనను ముట్టుకోబోయిన బిడ్డను తల్లి అడ్డుపెడుతుందా? లేక మనస్సు మలినపర్చుకుంటుందా? భంగీ, చమారుల విషయం అలాంటిది కాదు. ఈ శబ్దాలే తిరస్కార సూచకాలయిపోయినవి. వీరు జన్మతోనే అస్పృ

శ్యులయిపోయినారు. వీరు మణుగులకొద్దీ సబ్బు యేండ్ల తరబడి శరీరాల మీద రాసుకుంటూ, రోజూ స్నానం చేస్తున్నప్పటికీ, ప్రతినిత్యమూ నియమం తప్పకుండా గీతాపఠనం చేస్తున్నప్పటికీ, వ్రాతకోతలో లేక మరో గౌరవప్రదమైన వృత్తి నవలంభిస్తున్నప్పటికీ, వారు ఈ నాటికీ అస్పృశ్యులుగానే వుంటున్నారు—గదా! ఇది ధర్మమంటారా? ఈలాంటి ప్రవర్తన అనవచ్చునా? ఎంతమాత్రమూ కాదు. ధర్మం కాదు, ఇది అధర్మం, నశించదగిన ధర్మం, అస్పృశ్యత హిందూ ధర్మంలో అనివార్యమైన అంగంగాదు, సరిగదా హిందూధర్మంలో ప్రవేశించిన కుళ్ళూ, పాపమూను. కనుక యీ కళంకం కడిగివేసి, ఈ పాపం పరిమార్చి హిందూధర్మాన్ని పునీతం, పవిత్రం చేయడం హిందువుడయిన ప్రతియొక్కని ధర్మం, పరమ కర్తవ్యం కూడా. ఈ భావంతోనే అస్పృశ్యతా నివారణ అనే వ్రతాన్ని ద్వాదశ వ్రతాల్లో చేర్చుకున్నాం కాబట్టి అస్పృశ్యత పాపం. అధర్మం అనుకునేవారంతా తప్పకుండా ప్రాయశ్చిత్తం చేసుకోవాలి. అస్పృశ్యులు కూడా మనవారేనని భావించి, వారిని స్పృశించాలి, దగ్గర తీసుకోవాలి. అలా చేయడంద్వారా తమను తాము పవిత్రులుగ, పునీతులుగా భావించడం హిందువుడయిన ప్రతియొక్కని కనీసధర్మం, కర్తవ్యంకూడాను. వారి దుఃఖం నివారించాలి. వీరి నీ స్థితికి పాలుచేసిన బలహీనతలను, అజ్ఞానాన్ని ఓర్పుతో ఎదుర్కొనడానికి హిందువులు వారికి తోడ్పడాలి. ఇతర హిందువులను కూడ యిలా చేయవలసిందిగా ప్రోత్సహించాలి. అస్పృశ్యతను ఈ దృష్టితో గమనిస్తూ, దాని నివారణ మార్గంలో తటస్థపడే ఐహిక రాజకీయపరిణామాలను యీ వ్రతధారి పరిగణించడు. ఈలాంటి పరిణామం కలిగినా, కలగకపోయినా

అస్పృశ్యతానివారణను వ్రతరూపంగా ఆచరణలో పెట్టే వ్యక్తి అదొక అనివార్య ధర్మంగా భావించి, అస్పృశ్యులనబడే వారిని తనతోడివారుగ సత్యం మొదలయినవాటిని ఆచరణలో పెడుతూ, ఐహిక పరిణామాలను గురించి ఆలోచించరాదు. సత్యాచరణ ఒక నియమంకాదు. అది అతని సహజస్వభావం. అస్పృశ్యత అధర్మం, అన్యాయమని సమాజంలో పుట్టిన కుళ్ళు అని ఒకసారి తెలుసుకున్నవారికి ఆ కుళ్ళే కేవలం, చమార్ భంగీల మేరకే పరిమితమై ఉండలేదని తెలుస్తుంది. గోరువాసంతగ ఆరంభమయి తరువాత కొండంతగా పెరిగి కడకు తాను ఆధారపడినదాన్నే సమూలంగా నాశనంచేయడం కుళ్ళ స్వభావం గదా! సరిగ్గా అస్పృశ్యతా కళంకంకూడ అలాంటిదే. ఈ అంటుజాడ్యం మొదట విదేశీయులపట్ల ఆరంభమయ్యింది. పిమ్మట సంప్రదాయాలమేరకు పాకింది. తరవాత తరవాత దీన్నాచరించేవారు, భూమికే భారమైపోయారు. అలాంటివారికి ఆహారవిహారాల్లోను, స్నానపానాదుల్లోను, కడకు జీవితనిర్వహణకు సహితం విధులు వ్రతాలు పాటికచడంతో, తీరికలేకుండా పోతుంది. ఆఖరికి తేలిన పర్యవసానం మేమంటే ఈశ్వరుని పూజించడం విస్మరించారు, తమను తామే పూజించుకోసాగారు. కాబట్టి అస్పృశ్యతానివారణ వ్రతధారి కేవలం అస్పృశ్యులనబడే భంగీ చమారులను తమలో కలుపుకోవడంతోనే తృప్తిపడడు. సమస్తమయిన ప్రాణుల్లో తనను తనలోని సమస్త ప్రాణులకు దర్శించనంతవరకు అతడు సంతృప్తినొందడు. అతనికి మనఃశ్శాంతి కలగదు. అస్పృశ్యతను నివారించడమంటే ప్రపంచ ప్రజలందరితోను స్నేహం నెరవుకోవడమన్నమాట. వారి సేవకుడన్న మాట. ఈ దృష్ట్యా అస్పృశ్యతా నివారణ అహింసకు జతవుతుందన్నమాట.

అహింస అంటేనే ప్రాణిమాత్రుల యెడల సంపూర్ణమైన ప్రేమ నెరపడం. గాన అస్పృశ్యతానివారణ తాత్పర్యంకూడా యిదే. ప్రాణిమాత్రుల మధ్య గల భేదభావం నిర్మూలించడమే అస్పృశ్యతానివారణమంటే ఒకవిధంగా చూచినట్లయితే అస్పృశ్యతాకళంకం కొద్దిగొప్పల తారతమ్యంతో ప్రపంచ జాతులన్నిటిలోను వ్యాపించివుంది. కాని యిక్కడ మనం కేవలం హిందూధర్మంలో పుట్టినకుష్ఠు రూపంలోనే చూస్తున్నాం. ఎందుకంటే హిందుధర్మంలో యిది ధర్మస్థాన మాక్రమించుకున్నది. అంతేకాదు. ధర్మమిషతో లక్షల కోట్లాది మానవులను తరతరాలనుంచి బానిసలుగా చేసివేసింది.'[1]

అస్పృశ్యతను గురించిన గాంధీజీ యీ భావాలతో ప్రేరితులయి కొంతమంది కాంగ్రెస్ హిందువులు వ్యక్తిగతరూపంగానైతేనేమి, లేక జాతీయసంస్థల, ఆశ్రమాల రూపంగానైతేనేమి అస్పృశ్యులనబడేవారు సమాన సానుభూతులపూర్వకంగా ఉండడానికనుకూలమైన వాతావరణం కల్పించారు. దీనికితోడు బ్రహ్మసమాజం, ఆర్యసమాజం మొదలైన వాటి ద్వారా కూడా అక్కడక్కడ అస్పృశ్యతా నివారణ కార్యం జరగ సాగింది. ఆఖరికి క్రియాత్మకంగానైతేనేమి, సంఘర్షణరూపేణా అయితేనేమి అస్పృశ్యతా నిర్మూలన కార్యకలాపాలు క్రమక్రమంగా వృద్ధికాసాగాయి.

ఒకప్రక్క మలబారులో వాయ్‌కమ్ సత్యాగ్రహం, గురువాయూరు మందిర ప్రవేశ ఆందోళనలు నడిస్తే, మరోప్రక్క మహారాష్ట్ర ప్రదేశంలో 'కొలాబా' జిల్లాలో మహాడ్ అనే గ్రామ చెరువులో

---

1. మంగల ప్రభాతం.

హరిజనులు నీళ్ళు తెచ్చుకోడానికై 1927లో డా॥ అంబేద్కరు ఆందోళన లేవదీశాడు. ఆ మహడ్ సత్యాగ్రహంలో వేలకొలది హరిజనులు పాల్గొన్నారు. ఈ సందర్భంలోనే అంబేద్కరు మన స్మృతిని తగల బెట్టడం జరిగింది. దీనితో సనాతనులకు గొప్ప దెబ్బ తగిలింది. దీనికి ప్రతిక్రియగా దేశంలో భయంకరమైన ఆందోళన చెలరేగింది. దీనితో దేశం అట్టుడికిపోయింది.

## వాయ్కమ్ సత్యాగ్రహం

దేశప్రఖ్యాతి గాంచిన వాయ్కమ్ సత్యాగ్రహం కేరళ ప్రదేశంలో 1924లో ఆరంభమయినప్పటికీ ఆ ప్రదేశంలో అస్పృశ్యతా ఆందోళన 1898 లోనే ఆరంభమయిందని చెప్పాలి.

అస్పృశ్యులనబడేవారు కొన్ని సార్వజనిక రహదారుల్లో నడువ రాదని అక్కడొక నియమం, ఈ అమానుషికమయిన రివాజుకు "అనుప గమ్యత" లేక "దూరత" అని పేరు. అస్పృశ్యతే అనుకుంటే దానికి రెండడుగులు ముందు యిది. "ఉల్లాయిన్" అను జాతి మనిషి 40 గజాల దూరంలో ఉన్నాడనడంతోనే శూద్రులు మైలబడిపోతారట. ఇక బ్రాహ్మణుల సంగతి వేరే చెప్పాలా! నయాడీ జాతి వ్యక్తి నూరు గజాల దూరంలోకి రావడంతోనే పై జాతులవారందరికీ అంటు తగిలేదట. (విల్‌సన్స్ కేస్ట్స్ భాగం 5, పుట 275) వాళ్ళకెవరేనా కాస్త భిక్షవేయా లనుకుంటే ఆ భిక్షను భూమిమీద పెట్టి దూరంగా తొలగిపోవాలి దాత. అప్పుడు నయాడీలు భయపడుతూ - భయపడుతూ వెళ్ళి ఆ భిక్షను తీసుకునేవారట. (అదే పుస్తకం పుట 274) చూడరాని జాతి కూడ ఒక

టుందట. దాని పేరు పడీవన్నన్. ఆ జాతివారిని చూచినంతమాత్రాన్నే పాపములుముకుపోతుందట. అమృతలాలు ఠక్కరు బాపా యీ జాతిని 'పడై యాకీచేరై' అనే చోట చూచి దగ్గరకు పిలవగా వారాయన దగ్గరకు రావడానికే సాహసించలేకపోయారట. కడకెంతో కష్టంమీద ఠక్కరు బాపా ఎదుటకు వచ్చి నిలబడ్డారట. దళితజాతివారి బట్టలుతకడం వీరి కులవృత్తి. రాత్రి రెండు గంటలనుంచి తెల్లవారేముందువరకు వీరు తమ పనిపాటలు ముగించుకుంటారట. పగలు తమతమ గుడిసెల్లో దాగి వుంటారు. పగటివేళ వీరు బైటకు రావడం అపరాధం కూడాను.

అప్పటికప్పుడే కేలికట్టు (కేరళ)లో బ్రహ్మసమాజం స్థాపించబడింది. అస్పృశ్యతా నివారణార్థం పనిచేయసాగింది. సాయంత్రం పూట అస్పృశ్యజాతి స్త్రీలు నెత్తిమీద గడ్డిమూటలు పెట్టుకుని కేలికట్టు పట్టణానికి వచ్చేవారు. వారు పబ్లిక్ రోడ్లమీద నడవడానికి భయపడు తుండేవారు. అందుమూలంగా యిరుకైన పెడదారులమ్మట, సందు గొందులమ్మట వస్తుండేవారు. వానాకాలంలో అదీ వీలుపడేదికాదు.

బ్రహ్మసమాజం, సిందేజీ నెలకొల్పిన దళితజాతి మిషన్ కార్య కలాపాలు పట్టణంవరకే పరిమితము; ఆఫీసర్ల మేరకే వారి ప్రచారాలు జరుగుతుండేవి. కాని పల్లెలవరకూ యీ కార్యాలు పాకలేకపోయాయి.

కేలికట్ పట్టణంలోని తాలి మందిరం ముందున్న రోడ్డుమీద నడిచే అధికారమప్పట్లో కేవలం అగ్రవర్ణాలవారికే తప్ప మరెవరికీ వుండేది కాదు. జామెరిన్ జాగీర్దారు మిస్టర్ ధార్న ''అస్పృశ్యులీ రోడ్డుమీద నడవరాదని'' ఒక బోర్డు రాసి పెట్టించాడు. గొప్ప ప్రసిద్ధి కల

థియోసఫీ వకీలు శ్రీ మంజరీ రామయ్యర్, శ్రీ పి. కృష్ణన్‌గార్లు దీన్ని గురించి కలెక్టరుగార్కి నోటీసు యిచ్చారు. "ఈలాంటి సైనుబోర్డు పెట్టడం అన్యాయం. దీనిని తొలగించవలసినది. తొలగించనియెడల మేము ఆ ఆజ్ఞనుల్లంఘించబోతున్నాము"ని. తరువాత తమ మాట ప్రకారం నిశ్చిత సమయాన వారిరువురూ రోడ్డుమీద నడిచారు. మరునాడు ఆ సైనుబోర్డు మందిరం ప్రక్కనున్న చెరువులో దొరికింది. బ్రహ్మ సమాజ సేవకుడయిన డాక్టరు 'వస్తమ్‌పోయల్‌చేయి' అనే ఆయన బేలాపురం మందిరం ముందున్న చెరువులో స్నానం చేశాడు. ఆ అపరాధానికాయన్ని అరెస్టుచేశారు. కాని కోర్టువారు ఆయన్ని నిరపరాధిగా ఎంచి విడిచిపెట్టారు.

వాయ్‌కమ్ సత్యాగ్రహానికి పూర్వమిలాంటి ఘటనలనేకం జరిగాయి. 1924లో కాంగ్రెసు మహాసభ కాకినాడలో జరిగింది. అక్కడే అదే సమయంలో శ్రీ టి. కె. మాధవన్ గాంధీజీని కలుసుకుని కేరళ ప్రదేశంలో అస్పృశ్యతా నివారణ కార్యం నడపడానికై సలహా అడిగారు. వారి సంప్రదింపుల ఫలితంగానే కాకినాడలో అస్పృశ్యతా నివారణ తీర్మానం పాసయింది. కేరళలో దళితజాతుల మహాగురువు, నాయకుడు అయిన శ్రీ నారాయణగురుగారి ప్రేరణ మాధవన్‌గార్కి లభించింది. శ్రీ నారాయణగురు ఉపదేశమేమంటే "మానవమాత్రులందరిది ఒకే జాతి, ఒకే ధర్మం, ఒకే ఈశ్వరుడు" అని.

1924 జనవరి 21వ తేదీన ఎర్నాకులం ప్రాంతీయ కాంగ్రెసు సమితి "అస్పృశ్యతా నివారణ కార్యం మరింత తీవ్రంగా నడపాలని

నిర్ణయించింది. ఆ నిర్ణయం ఫిబ్రవరి 16వ తేదీన తీర్మానంగా రూపొందింది. ఆ తీర్మానంలో "హిందువులయినవారందరికీ ఏలాంటి భేదభావం లేకుండా అన్ని దేవాలయ ద్వారాలు తెరవవలసినదని" దేవాలయ కమిటీవారిని కోరడం జరిగింది.

అదృష్టవశాత్తు కాంగ్రెసు తరఫున బైలుదేరిన పర్యవేక్షణ కమిటీ సరిగ్గా అదే సమయానికి అంటే ఫిబ్రవరి 29 నాటికి వాయ్కమ్ చేరుకున్నది. ఆనాటి సాయంకాలం అస్పృశ్యుల మీటింగు జరిగింది. ఆ మీటింగులో దేవాలయం ముందున్న రోడ్డుమీద జట్లుజట్లుగ నడవాలనే తీర్మానం పాసయింది. బాహాటంగా ప్రకటన కూడా జరిగింది. దానితో వాయ్కమ్ సత్యాగ్రహ సమస్య అఖిల భారత సమస్యగా మారింది.

ఫలాని జాతివారు ఫలాని రోడ్డుమీద నడవరాదను నియమం లేక 'అనుపగమ్యత' లేక 'దూరత' అస్పృశ్యతను నమిలి మింగిన అవమాన కరమైన రివాజు. దానికి ధర్మసమర్థనే కాదు. రాజ్యసమర్థన కూడా లభించడం మరింత దుఃఖదాయకం, సహించరాని అన్యాయం.

మార్చి 26 వ తేదీ తెల్లవారేసరికల్లా సత్యాగ్రహుల ప్రథమజట్టు 'తాలిమందిరం' పడమటద్వారంవైపు రోడ్డుమీద బయలుదేరింది. నిషేధిస్తున్న రోడ్డుమీద నడుస్తున్న జట్టును వెంటనే ప్రభుత్వం అరెస్టు చేసి, ఆరేసిమాసాల శిక్ష విధించి జైలుకు పంపింది. దీనితో ప్రజల్లో ఉత్సాహం పెరిగింది. ఏప్రిల్ 7వ తేదీన రెండవ జట్టు బయలుదేరింది. 9వ తేదీనన ఎ. కె. పిళ్ళై, వేలాయుధన్, మీనన్, కె. కె. అప్పన్ గార్లు అరెస్టయారు. ఈ అరెస్టులతో ప్రజల ఉత్సాహం మరింత

యినుమడించింది. సత్యాగ్రహం తీవ్రమయినది. ఈ వార్తలు నలు మూలలా వ్యాపించాయి. సార్వజనిక రోడ్లను, మార్గాలను, హిందువులైనవారందరికొరకు తెరవవలసినదని ట్రావన్‌కూర్ మహారాజుకు దేశ నాయకుల టెలిగ్రాములు చేరసాగాయి.

చూస్తూ చూస్తూ వారం పది రోజులలోపల 'వాయ్‌కమ్' సత్యాగ్రహ రూపం దాల్చింది. తమిళప్రాంత నాయకులు కొందరు సత్యాగ్రహంలో పాల్గొనడానికి తయారయ్యారు.

అరెస్టులాగిపోవడంలోనే దేవాలయం రెండువైపులద్వారాల దగ్గిర సత్యాగ్రహం చేయాలనే నిర్ణయం జరిగింది. దానిప్రకారం అమలు జరిగింది కూడాను.

బెల్గాం కాంగ్రెసు ద్వారా వాయ్‌కమ్ సత్యాగ్రహులకు ధన్యవాదాలందజేయబడ్డాయి. దానితోపాటు సార్వజనిక మార్గాలన్నీ ఎలాంటి అభ్యంతరాలు లేకుండా బాహాటంగా తెరవవలసినదని ప్రభుత్వంపేర అప్పీలు కూడా చేయబడింది. బెల్గాం కాంగ్రెసునుంచి తిరిగివచ్చిన కేరళ ప్రతినిధులద్వారా 'సాధ్యమైనంత త్వరలో వాయ్‌కమ్ వస్తాన'ని గాంధీజీ సందేశమందింది. సత్యాగ్రహులకు యిచ్చిన మాటప్రకారం గాంధీజీ అక్కడికి వెళ్ళారు. త్రివేండ్రం మహారాణి దివాన్‌గార్లను కలుసుకున్నారు. సత్యాగ్రహం విషయం మాట్లాడారు.

'సనాతన హిందువుల హృదయ పరివర్తనకొరకు యిదొక తపస్సు తప్ప మరేమికాదని, రాజ్యంపట్ల విరోధ మెంతమాత్రము కాదని' మహారాణికి, దివాన్‌గారికి నచ్చజెప్పారు. గాంధీజీ. సంతోషకర

మైన ఫలితం కలిగింది. ఈ సందర్భంలో అక్కడి పోలీసు కమీష నరు గాంధీజీని కొన్ని పర్యాయాలు కలుసుకోవడం తటస్థించింది. ఆ కలయిక ఫలితంగా కమీషనరు గాంధీగార్కి పూర్తిగా భక్తుడయి పోయాడు.

ఏప్రిల్ 7 వ తేదీన రోడ్లమీద నడపరాదన్న నిషేధాజ్ఞ తొలగి పోయింది సత్యాగ్రహులకు అడ్డుగా వేసిన ముండ్లతీగలు మొదలయిన ప్రతిబంధకాలన్నీ తొలగిపోయినవి. తత్ఫలితంగా రెండునెలల తరువాత దేవాలయం దక్షిణవైపు రోడ్లు సర్వజనులకొరకు తెరవబడినవి. ఇది వాయ్కమ్ సత్యాగ్రహపు దిగ్విజయమని చెప్పాలి.

## గురువాయూరు దేవాలయ సత్యాగ్రహం

హరిజనులు దేవాలయాల్లో ప్రవేశించనంతవరకు అస్పృశ్యతను కూకటివేళ్ళతో నశింపచేయలేమన్న సంగతి అస్పృశ్యతానివారణ సంద ర్భంలో కొంతకాలంగా అందరకూ తట్టుతున్న విషయమే. అందుచేత 1931వ సం॥లో 'బడాగరా' అనే చోట జరిగిన కేరళ ప్రదేశ కాంగ్రెసు పరిషత్తులో హరిజనమందిర ప్రవేశ సమస్య చర్చకు వచ్చింది. ఈ హరిజన మందిర తీర్మానమే నెగ్గినట్లయితే సవర్ణ హిందువులు కాంగ్రెసునుంచి వైదొలగిపోగలరేమోననే భయం కొందర్ని వేధించ సాగింది. కాని అలాంటి సందేహాలకు చోటులేకుండానే పోయింది. సుప్రసిద్ధ సర్వోదయ నాయకుడైన శ్రీ కేలప్పన్ యీ విషయమై బొంబాయి వెళ్ళి గాంధీజీతో సంప్రదించగా సంతోషంగా తన సమ్మతిని

తెలియపరిచారు. కాని ఈ ఉద్యమం స్వదేశ సంస్థానాల్లో ఆరంభించ రాదని సలహానిచ్చారు. అందుచేత ప్రాంతీయకాంగ్రెసు సమితి గురువా యూరులో సత్యాగ్రహం జరపడానికి నిశ్చయించింది. అదీ నవంబరు 1 వ తేదీనుంచే.

గురువాయూరు మందిర కమిటీవారు దేవాలయం చుట్టూ ముళ్ళ తీగలు నాటించారు. సత్యాగ్రహులను ఎదుర్కోడాన్కిగాను మంచి వాలం టీర్ల దళాన్ని కూడా సిద్ధపరచుకున్నారు.

1931 నవంబరు 1వ తేదీన ఉదయం 9 గం॥లకు గురువాయూరు మందిరం నలువైపుల నాలుగుద్వారాలవద్ద సత్యాగ్రహులు గుమ్మిగూడారు. నేరుగా గర్భగుడిలోకి వెళ్ళి దేవునికి నైవేద్యా లర్పించుకోవాలని హరి జన భక్తులు కోరారు. అంతకుముందు గుడిబైట ఒక నియమితస్థలంలో నైవేద్యాలు పెట్టే ఆచారముండేది. దేవాలయ సంరక్షకులు సత్యాగ్రహు లను అడ్డుపెట్టారు. సత్యాగ్రహులు భజనకీర్తనలు పాడుకుంటున్నారు. ప్రజలగుంపు అధికమయింది, "హే ప్రభో! మేము కూడా భక్తులమే గదా! నీ ప్రేమ వాత్సల్యాల కర్హులము కాదూ? అయితే మమ్మెందు కింత దూరాన్నుంచుతున్నావు? కొద్దిమంది అగ్రవర్ణాలవారిని యెందుకు దరిజేర్చుకుంటున్నావు?" అనే ఆశయంగల కరుణారసభరితమైన కీర్తన పాడుతుంటే శ్రోతల కంఠాలు గద్గద చెందిసాగాయి. కండ్లమ్మట కన్నీరు వడవడా కారసాగింది.

శ్రీ కేలప్పన్, శ్రీ ఎ. కె. గోపాలన్ ఏకాదశీ పుణ్యదినంనాడు సత్యాగ్రహం ఆరంభించారు. శ్రీ ఆర్. అయ్యర్, రాజాజీగార్లు

గురువాయూరు వెళ్ళి 'సత్యాగ్రహం కొనసాగించడానికి కావలసినసహాయం చేయవలసినద'ని అక్కడి ప్రజలను ప్రార్థించారు.

ఉత్సాహవంతులయిన ప్రజలు ముళ్ళతీగలను నరకిపారవేశారు. రెండవసారి నూరుగజాలదూరంలో ముళ్ళతీగలు నాటగా అది తీసి పారవేశారు. మూడవసారి దేవాలయం సంరక్షకులు ఏబదిగజాలదూరంలో తీగలు నాటించారు.

ఇంతలో ఒక విచిత్రయోగం తారసిల్లింది. యరవడా జైల్లో గాంధీజీ తన చరిత్రప్రసిద్ధగాంచిన ఉపవాసం సెప్టెంబరు 20 వ తేదీ నుంచి ఆరంభించారు. అటు సత్యాగ్రహం మొదలుపెట్టి నవంబరు ఒకటవతేదేనాటికి సంవత్సరం పూర్తిగావస్తున్నది. సరిగ్గా అదేరోజున కేలప్పన్ నిరశనవ్రతం పూనకం కల్పించుకున్నాడు. సెప్టెంబరు 21వ తేదీ నాడే కేలప్పన్ ఉపవాస మారంభించాడు. ఈ విషయం గాంధీగారికి తెలుపుతూ 'సజీవుడైన కేలప్పన్‌కంటే మృతుడైన కేలప్పన్ యెక్కువ జీవించగలడని ఆశీర్వదించమని' తంతినంపాడు. కేలప్పన్ ఉపవాసం తనకు అనుకరణ గాదని తలచి గాంధీజీ ఆయన్ని అడ్డుపెట్టలేదు.

'నిరాహారదీక్షనుగురించిన పూర్వసూచన అటు జామెరిన్ రాజుకి యివ్వలేదు. ఇటు నాతోనూ సలహా తీసుకోలేదు గాన వెంటనే నిరాహారదీక్ష విరమించవలసినదని' గాంధీజీ తంతి అక్టోబరు 2వ తేదీన కేలప్పన్‌కు చేరింది. కేలప్పన్ వెంటనే ఉపవాశం విరమించుకున్నాడు. తరువాత గాంధీజీ జామెరిన్‌రాజుగారికి యీ క్రింది తంతిని పంపారు:....

'గురువాయూరు మందిరం మూడుమాసాలలోపలన హిందువులయిన ప్రతి

వారికీ తెరవవలసినది. ఒకవేళ యీ గడువులోపల మందిరం తెరవని పక్షాన 1933 జనవరి 2వ తేదీలోపల సత్యాగ్రహం ప్రారంభిస్తాను.

గురువాయూరు మందిరం పొన్నాయి తాలూకాలో వున్నది. అక్కడ మందిరం ప్రవేశం గురించి ప్రజాభిప్రాయం కనుగొంటున్నారు. శ్రీమతి కస్తూర్‌బా గాంధీ, రాజాజీగార్లు మందిర ప్రవేశాన్ని సమర్థిస్తూ ప్రభావాత్మకమైన ప్రచారం గావించారు. ప్రజాభిప్రాయసేకరణ కెవరూ సహాయపడరాదని విరోధిపక్షంవారు ప్రచారం చేశారు. ఐనప్పటికీ 64 శాతం పైన హరిజన మందిర ప్రవేశ పక్షంలో ప్రజాభిప్రాయం తేలింది. నిజానికిది గురువాయూరు సత్యాగ్రహానికి గొప్ప విజయమని చెప్పాలి. కేలప్పన్ మరలా నిరశనవ్రతం బూనాడు. గాంధీజీ ఆయన్ని సమర్థించారు. ఈసారి కేలప్పన్ గొప్ప చిక్కులో పడ్డాడు. తన సత్యాగ్రహాన్నంగీకరించి ఆశీర్వదించమని గాంధీజీని మరలా కోరాడు. కాని ఈసారి గాంధీజీ అంగీకరించలేదు సరికదా! ''నీవు ఉపవాసమారంభిస్తే నేను ఉపవాసమారంభిస్తాన''న్నాడు. దీనితో కథ అడ్డం తిరిగింది. కేలప్పన్ తన ఉపవాసం విరమించుకున్నాడు. దీనితో మందిర ప్రవేశ ఉద్యమం కాస్త చప్పబడింది. కాని మందిర ప్రవేశానికి కావలసిన అనుకూల వాతావరణం మాత్రం బాగా ఏర్పడింది.

1947లో దేశానికి స్వతంత్రం లభించడంతోనే గురువాయూరు మంధిరం హరిజనులకొరకు తెరువబడినది.

## చరిత్ర ప్రఖ్యాతి గాంచిన ఉపవాసం

1932 సెప్టెంబరు 20వ తేదీనాడు యరవడా జైల్లో గాంధీజీ ఉపవాసం ఆరంభించారు. నిజానికిది చరిత్రాత్మకమైనదని చెప్పాలి.

దీని పర్యవసానంగానే పూనా ప్యాక్టు పుట్టింది. దీని ప్రభావంవల్ల అస్పృశ్యతా నివారణోద్యమం దేశంలో మరింత తీవ్రమయింది. ఇంత ప్రఖ్యాతి చెందిన ఉపవాసపు పుట్టుపూర్వోత్తరాలివి:—

లండనులో రెండవ రౌండు టేబులు సమావేశంలో అల్పసంఖ్యాకుల సమితిలో మాట్లాడుతూ, గాంధీజీ తన ఆవేదన యీవిధంగా వెల్లడించారు :—

''హరిజనులను'' హిందూ సమాజం నుంచి వేరుచేసే విధానాన్ని నా ప్రాణాలు ఒడ్డి అయినాసరే నేను ప్రతిఘటిస్తాను. అల్ప సంఖ్యాకులైన యితరుల విషయమైతే నేను కొంత అర్థం చేసుకోగలను. కాని హరిజనులను వేరు చేయడమనేది నేనంగీకరించజాలను దీని తాత్పర్యం అస్పృశ్యత శాశ్వతంగా వర్ధిల్లుతుందన్న మాట. భారతదేశపు స్వరాజ్యం కొరకు కూడా హరిజనుల హక్కులను అమ్మజాలను. నేను హరిజను లందరి ప్రతినిధినని చాలెంజి చేస్తున్నాను. ఈ విషయం ఓటింగుకు పెట్టినట్లయితే అత్యధిక మయిన హరిజనుల ఓట్లు నాకే లభించగలవని ఘంటాపథంగా చెబుతున్నాను. అస్పృశ్యత అస్పృశ్యులది కాదనిన్నీ ఇది కేవలం హిందువులకు పట్టిన కళంకమనిన్నీ, కనుక యిది ప్రత్యేక నియోజకవర్గాల ద్వారాను అసెంబ్లీలలో నియమించబడే రిజర్వుడు స్థానాల ద్వారా తొలగిపోయేదికాదని గట్టి నమ్మకంతో చెబుతున్నాను. సర్కారు జాబితాల్లోను, జనాభా లెక్కల్లోను, హరిజనులనే ఒక ప్రత్యేక జాతిని నమోదుచేయడం అనుచితమని నా నమ్మకం. అస్పృశ్యత చిరస్థాయిగా నిలచివుండేకన్నా హిందూధర్మం నశించిపోవడం అనేకరెట్లు మేలని నమ్మ

తున్నాను. త్రిలోకాలపై ఆధిపత్యం లభించినప్పటికీ హరిజనుల క్షేమం వారి హక్కులను నేను వదులుకోలేను. ఒకవేళ హరిజనులంతా ముస్లిములుగానో లేక క్రైస్తవులుగానో మారిపోయినా నాకంత చింత కలగదు. అది నేను సహించుకోగలనుగాని ప్రతి గ్రామంలో అవర్ణులు, సవర్ణులనే రెండు జాతులవారు వేరువేరుగా ఉండడం సహించజాలను. హరిజనుల రాజనైతిక అధికారాలను గురించి మాట్లాడేవారు భారతదేశ స్థితిగతులు ఎంతమాత్రం ఎరుగరు. కాబట్టి దీన్ని ప్రతిఘటించడంలో నాకెవరు తోడ్పడకపోయినా సరే నేను ఒక్కణ్ణి ప్రాణాలను సహితం ఒడ్డి ప్రతిఘటిస్తానని నేను మనఃపూర్వకంగా చెబుతున్నాను. అల్పసంఖ్యాక ప్రత్యేక నియోజకవర్గాల సందర్భంలో గాంధీజీ పై అభిప్రాయాన్ని వెల్లడించారు.

లండన్‌నుంచి గాంధీజీ, యితర నాయకులు రిక్తహస్తాలతో తిరిగి వచ్చారు. ఇందులో ఆశ్చర్యపడవలసినది ఏమీలేదు.

1932లో ఫిబ్రవరి 2వ తేదీన ఉదయాన్నే గాంధీ, వల్లభభాయ్ పటేలుగార్లను అరెస్టుచేసి స్టేటు ప్రిజనర్సుగ బంధించింది ప్రభుత్వం. అగ్నికి ఆజ్యం తోడైనట్టు దీనితో అసహాయోద్యమం జోరందుకుంది. వేలకొలది స్త్రీపురుషులతో, పిన్నపెద్దలతో కారాగారాలు నిండిపోయాయి.

గాంధీజీ జైల్లో వున్నప్పటికీ హరిజనుల ప్రత్యేక నియోజకవర్గాల విషయం ఆయన బుర్ర పని చేస్తూనేవుంది. 1932 మార్చి 11 వ తేదీన ప్రత్యేక నియోజక పద్ధతి, యిటు అస్పృశ్యులకు, అటు సవర్ణులకు యిరువురకు హానికరమైనదని భారత మంత్రి సర్ శామ్యూల్ హోర్‌కు జాబు వ్రాశారు. ప్రస్తుతం హిందువులలో హరిజనుల ఉనికి అర్థం చేసుకో

నంత వరకూ ప్రత్యేక నియోజకవర్గాల వల్ల కలిగే ప్రమాదం గ్రహించడం కష్టం. హిందూధర్మానికి సంబంధించినంతవరకు ప్రత్యేక నియోజక వర్గాలవల్ల ఛిన్నాభిన్నం కాకతప్పదు. అనేక యుగాలుగా హరిజనులను అన్యాయంగా అధోగతిపాలుచేసి ఉంచిన కళంకదోషం సవర్ణహిందువులు చేసే ఎలాంటి ప్రాయశ్చిత్తమూ కడిగివేయజాలదని కూడ గాంధీజీ భారత మంత్రికి వ్రాశారు. ప్రత్యేక నియోజక పద్ధతి ఒక ప్రాయశ్చిత్తము కాదు. హరిజనులనుభవిస్తుండే కష్టాలకు విరుగుడూ కాదు.

భారత మంత్రి దీనికిచ్చిన సమాధానం "లోథియన్ కమిటీ రిపోర్టును పరిశీలించినమీదట అందు వారిచ్చిన సలహాల ననుసరించి ఈ విషయంలో మేమొక నిశ్చయానికి రాగలుగుతాము" అని. ఇది కేవలం నిరాశాజనకమైన జవాబు.

ఆగస్టు 18న గాంధీజీ బ్రిటీషు ప్రధానమంత్రి రాంసే మాక్డోనల్డు గార్కి ఇలా వ్రాశారు:— "అల్పసంఖ్యాకుల విషయమై బ్రిటీషు ప్రభువులిచ్చిన జవాబులు నేను చదివాను. ఇది కేవలం నిరాశాజనకమైనది. రౌండుటేబులు కాన్ఫరెన్సులో అల్పసంఖ్యాకుల సమితిలో నేను ప్రకటించిన ప్రకారం ప్రాణాలనొడ్డయినా సరే మీ నిర్ణయాన్ని ప్రతిఘటిస్తాను. బ్రిటీషు ప్రభువులు మనఃపూర్వకంగానైతేనేమి, లేక ప్రజల ఒత్తిడివల్లనైతేనేమి, హరిజనుల ప్రతినిధి ఎన్నికలు సాధారణ ఎన్నికల ప్రకారమే జరగాలి. ఎన్నికాధికారం కూడ అందరికి సమానంగానే ఉండాలనే విషయం గురించి పునరాలోచన చేయనంతవరకు నేను ఉపవాసం విరమించను. తాము పట్టిన కుందేటికి మూడేకాళ్ళన్నట్టు పై విషయం బ్రిటీషు

ప్రభువులు పునరాలోచించని పక్షంలో సెప్టెంబరు 20వ తేదీ మధ్యాహ్నం నుంచి నా ఉపవాసం ఆరంభమవుతుంది.''

బ్రిటీషు ప్రధానమంత్రి గాంధిజీ కిచ్చిన జవాబులో చెప్పుకోదగిన కొత్తదనమేమి లేదు. సాంప్రదాయక నిర్ణయంమీదనే వాళ్ళు పట్టు బట్టారు. ప్రత్యేక ఎన్నికల పద్ధతిలోనే హరిజనుల హితువు, సవర్ణ హిందువుల ఐక్యతని హితమైవున్నవని వారి దృఢమైన నమ్మకం. ఆఖరున గాంధీజీకి వారిలా జవాబిచ్చారు:— ''వస్తుస్థితిని అర్థంచేసుకోవడంలో కాస్త అపోహ జరిగిన కారణంగానే మీరు ఆమరణ ఉపవాస నిర్ణయాని కొచ్చారు.''

1932 సెప్టెంబరు 9వ తేదీన గాంధీజీ ప్రధానమంత్రి కిలా వ్రాశారు:— ''దళితవర్గాల ప్రత్యేక నియోజకవర్గం అనే కల్పన వచ్చేసరికి నాకొక ప్రబలమయిన ప్రమాదం ముంచుకొచ్చేట్లు కనబడుతున్నది. ఆ ప్రమాదంవల్ల హరిజనులకు లాభంలేదు సరిగదా సవర్ణహిందువులు తప్పకుండా నాశనమైతీరుతారు. అస్పృశ్యులనబడే వారందరూ హిందూ సమాజంలో ఉండదలచుకుంటున్నంతవరకు ఒక చట్టం ద్వారా వారినా సమాజంనుంచి విడదీయడం నేనెంతమాత్రమూ అంగీకరించను.''

గాంధీజీ తన ఉపవాస నిర్ణయం గురించి ఒక స్టేటుమెంటు సెప్టెంబరు 15వ తేదీన బొంబాయి ప్రభుత్వానికి పంపించారు. ఆ ప్రభుత్వం దాన్ని సెప్టెంబరు 21న ప్రకటించింది. ఆ స్టేటుమెంటు చివరి భాగంలో గాంధీజీ యిలా వ్రాశారు:— ''ఎంతో పవిత్రమైన భావప్రేరణతో నేను ఈ ఉపవాసం ఆరంభిస్తున్నాను. కాని ఒక వ్యక్తి

నుద్దేశించిగాని లేక మరో విధమైన ద్వేషంతోగాని చేయడంలేదని మరొక సారి చెబుతున్నాను. నామట్టుకిది ఒక విధమయిన అహింస, దానిపైన ఆఖరి ముద్రని నా నమ్మకం.''

సెప్టెంబరు 20వ తేదీన గాంధీజీ ఆమరణ నిరాహార దీక్ష బూననున్నారనే వార్త దేశం నలుమూలలా వాయువేగంతో వ్యాపించి పోయింది. దానితో దేశీయుల హృదయాలు కంపించిపోయాయి. 20వ తేదీ సరిగ్గా 11 గం॥లకు ఉపవాసమారంభమయింది. ఒక్క గాంధీగారికే కాదు దేశీయులందరికీ ఆ రోజు ఉపవాస ప్రార్థనలతోనే గడిచింది. శాంతినికేతనంలో గురుదేవులు రవీంద్రనాథ ఠాగూరు కూడా ఆ రోజు నల్లని దుస్తులు ధరించి ఒక విశాలమైన జనసముదాయానికి ఉపవాస మహిమను గురించి తెలియపరిచారు. తరువాత వారందర్నీ నాటినుండే అస్పృశ్యతా నివారణకొరకు సన్నద్ధులు కావలసిందని ప్రార్థించారు.

దేశంలో అంటరానివారిపట్ల ప్రేమసానుభూతుల వెల్లువై పెల్లుబికి నట్లయింది. దేవమందిరాలు, నీళ్ళరేవులు, నూతులు మొదలైన సార్వ జనిక స్థలాలు హరిజనులకొరకు స్వేచ్ఛగా తెరవబడసాగినయి. సవర్ణ అవర్ణ నాయకుల సమావేశ సమ్మేళన మొకటి వెంటనే జరిగింది. బ్రిటీషు ప్రభువులు నిర్ణయించిన సాంప్రదాయిక నిర్ణయోపాయంకాక మరొక మంచి ఉపాయం—హరిజనులకు యింతకంటే అధిక అనుకూలం, హితవయిన ఉపాయం—వెదకడమే ఆ ప్రత్యేక సమావేశ ప్రధానోద్దేశము. బొంబాయి పట్టణంలో జరిగిన ఆ సమావేశంలో పాల్గొన్న పండిత మదన మోహన మాళవ్యా, సర్ తేజ్‌బహదూర్ సప్రూ, ఎమ్. ఆర్. జయకర్,

చక్రవర్తి రాజగోపాలాచారి, కేల్కర్, రాజేంద్రప్రసాదు, మూంజే మొదలయిన ప్రజానాయకులు సాధ్యమైనంత త్వరలో సర్వాంగీకారమైన ఒక నిర్ణయానికి రావాలని ప్రయత్నించారు. కాని అది జరగలేదు. కారణం ఆనిర్ణయానికి కావలసిన కీలకం దళితవర్గనాయకుల్లో ముఖ్యంగా డాక్టరు అంబేద్కరు చేతిలో వుండడమే. ఆయన ప్రత్యేక నియోజక సూత్ర సమర్థకుడు. కనుక ఆయన అంగీకారమే లేకుండా ఏ విధమైన తీర్మానం బ్రిటీషు ప్రభువుల సమక్షంలో పెట్టడానికి వీలులేదు. ఇటు దినదినానికి గాంధీగారి స్థితి తీసుకట్టుకావస్తున్నది. అటు సమస్య తీరడానికి బదులు మరీ చిక్కులో పడ్డది. ఐనప్పటికీ నాయకులు ధైర్యం వీడలేదు. నిదానం కోల్పోలేదు. కొంత సాగరమంథనానంతరం అందరూ ఏక గ్రీవంగా ఒక నిర్ణయానికి రాగలిగారు. ఆ గంభీరమథనంలో తేలిన సిగ్గే పూనా పేక్టు.

శాసనసభలో నిమ్నజాతులకుండవలసిన ప్రాతినిధ్యం, వారి పురోభివృద్ధికి సంబంధించిన విషయాలగురించి, అవర్ణ సవర్ణ నాయకులు ఈ క్రింది షరతులమీద చరిత్ర ప్రసిద్ధి చెందిన ఆ ఒడంబడిక చేసుకున్నారు:

1—సామాన్య నియోజకవర్గములద్వారా ఎన్నికలు జరిగే పద్ధతిని ప్రాంతీయ శాసనసభలో నిమ్నజాతులవారికి యీ దిగువ స్థానాలు ప్రత్యేకించబడును;—

| | | | |
|---|---|---|---|
| మద్రాసు | 30 | బొంబాయి, సింధు | 15 |
| పంజాబు | 8 | బీహార్, ఒరిస్సా | 28 |
| మధ్యభారత్ | 20 | అస్సాం | 7 |
| బెంగాలు | 30 | సంయుక్త ప్రాంతం | 20 |

ఏ రాష్ట్ర శాసనసభలో నిమ్నజాతులవారి సంఖ్య ఎంత వుండవలెనో, బ్రిటిషు ప్రధానమంత్రి నిర్ణయించాడు. ఆ నిర్ణయంపైన ఆధారపడినవే ఈ అంకెలు.

2. ఈ స్థానాలకు సంయుక్త నియోజకవర్గాల పద్ధతినే ఎన్నికలు జరుగును. కాని ఎన్నిక ప్రణాళిక యీ క్రింది విధంగా ఉండును:—

ఒకే మండలానికి చెందిన ఓటర్ల లిస్టులో నమోదు చేయబడిన నిమ్నజాతి అభ్యర్థులొక కమిటీగా యేర్పడతారు. ఆ కమిటీ నిమ్నజాతులకొరకు ప్రత్యేకించిన ఒక్కొక్క స్థానానికి నలుగురేసి నిమ్నజాతి అభ్యర్థులను ఎన్నుకుంటుంది. ప్రతీ ఓటరుకు ఒకేఒక ఓటు వేసే అధికారముంటుంది. ఆ నలుగురులో అధిక ఓట్లు సంపాదించిన అభ్యర్థే నిమ్నజాతుల ప్రతినిధి అవగలడు. ఈ విధంగా ప్రాథమిక ఎన్నికల్లో వచ్చినవారే సామాన్య ఎన్నికలో అభ్యర్థులవుతారు. వారిలో ఒకరు సంయుక్త నియోజక పద్ధతి ప్రకారం నిమ్నజాతుల ప్రతినిధి అవుతాడు.

3. కేంద్ర శాసనసభకు కూడా నిమ్నజాతులకు ప్రత్యేక స్థానాలుండగలవు. వీటి ఎన్నికలు సంయుక్త నిర్వచన ప్రణాళికననుసరించే జరుగును. అంటే సరిగ్గా ప్రాంతీయ శాసనసభలకు జరిగినట్లుగానే ప్రాథమిక ఎన్నికా విధానం యిక్కడ వర్తిస్తుందన్నమాట.

4. కేంద్రీయ శాసనసభలో సామాన్య నియోజకవర్గముల ద్వారా బ్రిటీషు ఇండియా ప్రజలకు గల స్థానాలలో 18 శాతం నిమ్నజాతులకొరకు ప్రత్యేకించబడును.

5. కేంద్ర ప్రాంతీయ శాసనసభలకు నలుగురు అభ్యర్థులను ఎన్ను కునే పార్థమిక నిర్వచన ప్రణాళిక గడువు పదిసంవత్సరాలవరకే ఉండును. ఒకవేళ అవర్ణ, సవర్ణుల మధ్య ఉభయుల యిష్టానుసారం 'ఈ పద్ధతి మాకవసరం లేద'నుకునే యెడల యీ గడువులోపలే ఇది అంతము కావచ్చును.

6. ఉభయసాంప్రదాయాలవారు తమ యిచ్ఛానుసారం ఎలాంటి నూతన నిర్ణయం చేసుకోనంతవరకూ, ఉభయ శాసనసభలలో ప్రత్యే కించబడిన స్థానాల ద్వారా నిమ్న జాతి అభ్యర్థుల నెన్నుకునే పద్ధతి అమలు నందుండును.

7. రోథియన్ కమిటిలో నిర్ణయింపబడిన అర్హతలు గలవారే ఉభయశాసనసభలలో నిమ్న జాతి అభ్యర్థులుగ నిలబడగలరు.

8. స్థానిక సంస్థల ఎన్నికలకు నిలబడడానికిగాని, లేక ప్రజా సేవకోద్యోగానికి నియమించుటకుగాని నిమ్న జాతికి చెందినవాడైనంత మాత్రాన ఎవరూ అయోగ్యులుగా తలపబడరు. విద్యావిషయాలలో తగిన యోగ్యతలు గల నిమ్న జాతి అభ్యర్థులకు ప్రజాసేవకోద్యోగాలలో సాధ్య మైనంతవరకూ వారికి తగు ప్రాతినిధ్యం యివ్వడానికి యత్నించబడును.

9. చదువుసంధ్యలకొరకు ఆయా ప్రాంతాలలో నిర్ణయింప బడిన ఆర్థిక సహాయ నిధినుంచి యథోచిత భాగం నిమ్న జాతుల విద్యాభి వృద్ధులకొరకు వారి ప్రతినిధుల పేరుమీద కేటాయించబడును.

ఆ పూనా ఒడంబడికమీద ఈ క్రింది నాయకులు సంతకం పెట్టారు.

| | |
|---|---|
| 1. మదనమోహన మాళవ్యా | 12. వి. యస్. రామన్ |
| 2. తేజ్‌బహదర్ సప్రూ | 13. జి. కె. దేవధర్ |
| 3. ఎమ్. అర్. జయకర్ | 14. అమృతలాల్ వి. ఠక్కర్ |
| 4. భీమారావ్ ఆర్. అంబేద్కర్ | 15. ఆర్. కె. బఖలే |
| 5. శ్రీనివాసన్ | 16. సోలంకి |
| 6. ఎమ్. సి. రాజు | 17. బాబూ పాలవణకర్ |
| 6. సి. వి. మెహతా | 18. గోవింద మాళవ్యా |
| 8. సి. రాజగోపాలాచారి | 19. దేవదాస్ గాంధి |
| 9. రాజేంద్రప్రసాదు | 20. వి. ఎస్. రాజ్‌భోజ్ |
| 10. శంకర్‌లాల్ జేంకర్ | 21. గవయ |
| 11. ఘనశ్యామ్‌దాస్ బిర్లా | 22. విశ్వాస్ |

1932 సెప్టెంబరు 24 వ తేదీన యీ సంతకాలు జరిగాయి. కనుక నాటినుండి ఆ తేదీ 'హరిజనదే' అనే పేరుతో చరిత్రలో ప్రసిద్ధి చెందింది.

25 వ సెప్టెంబరునాడు బొంబాయిలో మరికొందరు ప్రముఖులు సర్వశ్రీ హృదయనాధ కుంజ్రూ, హంస మెహతా, వి. కోదండరావ్, జి. కె. గాడ్గిల్, కె. నటరాజన్ మొదలయిన 18 గురు ఆ ఒప్పందం మీద సంతకాలు పెట్టారు.

బ్రిటిషు మంత్రి మండలి పూనా ఒప్పందంమీద వెంటనే అంగీకార ముద్రవేసింది. దీని పర్యవసానంగా గాంధీగారి ఉపవాసవ్రతం

సమ్మానపూర్వకముగా ముగిసింది. దానితో సేతుశీతనగపర్యంతం భారతీయులకు మనఃశాంతి కలిగింది. కాని సత్యఅహింసల మర్యాదొకటుంది కదా గాంధీజీకి. అందుకే ఉపవాసం విరమించే ముందు 'ఒకవేళ సరయిన గడువులోపల అస్పృశ్యనివారణకు సంబంధిచిన సంస్కారణలు జరగనియెడల తప్పనిసరిగా మరల నేను ఉపవాసవ్రతం పట్టవలసి వస్తుంది' అనే షరతుపెట్టారు గాంధీజీ. పూనా ఒప్పందం సందర్భంలో హరిజనమిత్రులకు (గాంధీగారి మాటల్లో ఇకనుంచి వారిని నేను పేరుతో పిలుస్తాను) యీ ఒప్పందం విశ్వసనీయంగా అమలుజరుగుటకొరకు మీరు నా ప్రాణాలను జనూనతుగా పెట్టుకోవలసినదని సలహా ఇచ్చారు గాంధీజీ. అదే స్టేటుమెంటులో ఇంకా ఇలా అన్నారు:—'యజ్ఞాగ్ని ఒకసారి ప్రజ్వరిల్లిన తరవాత దేశంలో అస్పృశ్యత నామరూపాలు లేకుండాపోనంతవరకు, దానిని ఆరిపోనివ్వకూడదు. హిందూధర్మం మీద పడిన యీ కళంకం, భయంకరమైన ఈ అభిశాపం కడిగివేయటానికి తమతమ ప్రాణాలను సహితం త్యజించే త్యాగశీలురు, సంస్కర్తలు వేలకొలదిగ ఉన్నారని విశ్వసిస్తున్నాను. రాజనైతిక దృష్ట్యా ఈ ఒప్పందమహత్వం అధికమైనదే. ఐనప్పటికీ విశాలమైన సంస్కార క్షేత్రంలో అంత విలువయినది కాదు. సంఘసంస్కర్తలకు, సనాతన హిందువులకు నేనివ్వగోరుతున్న హెచ్చరిక యేమంటే 'అస్పృశ్యతా నివారణ కార్యంపెట్టిన గడువులోపల తత్పరతాపూర్వకంగా పూర్తిచేయని పక్షంలో, తప్పనిసరిగ మరల ఉపవాసం చేస్తానని వాగ్దానం యిచ్చియున్నాను.'

1932 సెప్టెంబరు 25వ తేదీన బొంబాయిలో మదనమోహన్ మాళవ్యాగారి సభాపతిత్వంలో జరిగిన ఒక విశాల సభలో యీ క్రింది తీర్మానం చేశారు:—

"ఈ సభ నిశ్చయపూర్వకంగా విశ్వసిస్తున్నదేమంటే నేటినుండి హిందూ సమాజంలో ఎవరూ పుట్టుకతో అస్పృశ్యులుగ ఎన్నబడరు. ఇంతవరకూ అలాతలవబడిన జాతులవారే నేటినుండి అందరు హిందువులతో పాటు నూతులు, జలాశయములు, పాఠశాలలు, రహదార్లు, ఆదిగా గల సార్వజనిక స్థలాలు నిరభ్యంతరంగా ఉపయోగించుకోవచ్చును. అవసర మైతే యీ అధికారాలనే చట్టరూపంగా రూపొందించ వచ్చును. స్వరాజ్య పార్లమెంటుకు పూర్వమే ఈ రూపం దాల్చేస్తే సరేసరి. లేనియెడల స్వరాజ్యపార్లమెంటు రూపొందించే చట్టాల్లో యిదే ప్రథమ చట్టమవుతుంది. ఇంకా నేటివరకు పరంపరంగా వస్తున్న రివాజులమూలంగా హరిజనులబనదే వారికి దేవాలయ ప్రవేశ విషయంలో జరుగుతున్న అడ్డంకులు, ప్రతిబంధకాలు మొదలయిన వాటిని న్యాయసమ్మతమయిన, వైధానిక పద్ధతులతోనూ శాంతియుతంగానూ తొలగించడం హిందూ నాయకులందరూ తమతమ విద్యుక్త ధర్మంగా భావిస్తారనికూడా యీ సభ పూర్తిగ విశ్వసిస్తున్నది.

ఈ తీర్మానాన్ని బలపరుస్తూ డాక్టరు అంబేద్కరు యిలా ప్రకటన చేశారు:—"ఒక భారతీయమహాపురుషుని ప్రాణం రక్షించడం మనకుఎంతయో అవసరము. ఇటు నావారి హక్కులను రక్షించాలి. వారి సమస్యను పరిష్కరించే ప్రయత్నాలు నాబుద్ధికందినంతవరకు రౌండుటేబుల్ కాన్ఫరెన్సు నాటినుంచి చేస్తూనేఉన్నాను. అన్నిటికంటే అధికంగా సంతో

షించవలసిన విషయమేమంటే మనందరి సమవేతప్రయత్నంవల్ల మహాత్ముని ప్రాణాలు రక్షించగలిగాము. ఇంకా భావికాలంలో నిమ్నజాతుల హితాని కనుగుణమైన సంరక్షణల విషయంలో సర్వాంగీకారమైన ఉపాయం కనుగొనడంలో కృతకృత్యులమయినాము. ఇది మనందరం సంతోషించవలసిన విషయం. ఈ ప్రయత్నాలలో ప్రధాన శ్రేయం గాంధీజీకే దక్కినది అని నేను తలుస్తున్నాను. గాంధీజీలోను, నాలోను యింత భావసామ్యమున్నదన్న సంగతి ఆయనతో కలుసుకున్నమీదటనే గ్రహించగలిగాను. రౌండుటేబులు సమావేశంలో సుతారం నాకు వ్యతిరేకుడుగ వున్నవ్యక్తి యింత త్వరలో యీవిధంగా నన్ను రక్షించడానికి వచ్చినాడా లేక నా విపక్షాన్ని రక్షించడానికివచ్చాడా! అని ఆశ్చర్యం కూడా కలిగింది. ఇంతకూ మహాత్మగాంధీజీ నన్నొక ప్రమాదకరమయిన, గొప్ప అఘాతంనుంచి రక్షించారు. ఇందుకు నేనెంతయో మహాత్మునికి కృతజ్ఞుడను.''

దళితవర్గాల రెండవ ప్రతినిధి ఎమ్. సి. రాజు ఆ తీర్మానాన్ని బలపరుస్తూ యిలా అన్నారు:—'ఏ సవర్ణహిందువుల హృదయాల్లో ఒక సత్ప్రవర్తన స్పష్టంగా చూస్తున్నాను గాన ఈ తీర్మానాన్ని బలపరుస్తున్నాను.'

ఇంకా కొందరు అవర్ణ సవర్ణ ప్రతినిధులు బలపరచినమీదట పై తీర్మానం సర్వసమ్మతితో ప్యాసయింది.

1932 సెప్టెంబరు 30 వ తేదీన మదనమోహనమాళవ్యాగారి సభాపతిత్వంలో యేర్పాటయిన సభలో ఈ దిగువ తీర్మానాలు ప్యాసయినవి:—

'1—(క) హిందువులు ఈ సార్వజనిక సభ దేశచరిత్రలో ఒక

ప్రమాదపూరితమయిన యీ ఘట్టంలో మహాత్మాగాంధీజీ ప్రాణాన్ని రక్షిస్తున్నందులకు భగవంతునకు ధన్యవాదాలర్పిస్తున్నది. అనేక ప్రయత్నాలవల్ల కుదిరిన ఒడంబడికకు కారణభూతులయిన అవర్ణ సవర్ణ నాయకులకు తమ అభివందనా లర్పిస్తున్నది.

(ఖ) గాంధీగారి ఉపవాసం సుఖాంతంగా ముగిసినందులకు ఆయన్ని యీ సభ అభినందిస్తున్నది. లోగడ హిందువుల హృదయాలలో అస్పృశ్యనివారణ గురించిన నవచైతన్యం అస్పృశ్యతను కూకటి వేళ్ళతో నశింపచేసే కార్యరూపంలో పరిణమించగలదని గాంధీజీకి యీ సభ విశ్వాసపూర్వకంగా హామీ యిస్తున్నది.

2. ఈ సభ సర్వసమ్మతితో నిర్ణయిస్తున్న దేమనగా అఖిలభారత అస్పృశ్యతానివారణసంఘం (ఎంటీ అంటచ్‌బిల్‌టీ లీగు) స్థాపించాలి. దాని కేంద్ర కార్యాలయం ఢిల్లీలో ఉండాలి. దాని శాఖలు యితర ప్రాంతాల్లో అస్పృశ్యతానివారణకు యత్నిస్తుండవలెను. ఇందుకొరకై దిగువ కార్యక్రమం వెంటనే చేపట్టవలసినది:—

1. సార్వజనిత నూతులు, చెరువులు, మార్గాలు, పాఠశాలలో స్మశానాదులన్నీ నిమ్నజాతులవారికొరకు బాహాటంగా తెరువవలెను.

2. సార్వజనికమందిరాలన్నీ హరిజనుల ప్రవేశార్థం తెరవబడవలెను.

ఈ రెండు కార్యక్రమాలు ఎలాంటి ఒత్తుడులులేకండా సాత్త్విక మార్గాల ద్వారా ప్రేమతో, అగ్రవర్ణంవారి హృదయ పరివర్తన గావించడానికి యత్నించవలెను.

3. ఈ అఖిలభారత అస్పృశ్యతానివారణసంఘం, త్వరగాను చక్కగాను సంఘటితమై తన ఉద్దేశాల పూర్తికోసరం పనిచేయుటకొరకు గాను, శ్రీ ఘనశ్యాందాసు బిర్లాను అధ్యక్షులుగాను, శ్రీ అమృతలాల్ విఠల్‌దాసు ఠక్కరును కార్యదర్శిగాను యీ సభ నియమిస్తున్నది.

4. హిందువుల యీ సార్వజనికసభ సాధ్యమైనంతవరకు అస్పృశ్యతానివారణ, తత్సంబంధమైన ఉద్దేశ్యాలకొరకుగాను పెద్ద పెద్ద మొత్తాలలో ధనసంకలనం చేయవలసినదని ప్రార్థిస్తున్నాం. ఇంకా యీ సంబంధమైన కార్యాలు అమలుపరచుటకు మూడవతీర్మానంలో పేర్కొన్న వ్యక్తులకు యీ సభ సర్వాధికారాలు సమర్పిస్తున్నది.'

మూడవనిర్ణయంప్రకారం అఖిలభారత అస్పృశ్యతానివారక సంఘం (అన్‌టచ్ బిలిటీ లీగు) స్థాపించబడినది. దాని కేంద్రకార్యాలయం ఢిల్లీలో నెలకొలిపారు. కొంతకాలం తరువాత యీ పేరు మార్చవలసివచ్చింది. కారణం పూనాలో అప్పటికే యీ పేరున ఒకసంఘం నడుస్తున్నది. సెంట్రల్‌బోర్డు మెంబర్ల అభిప్రాయానుసారం 1932 సెప్టెంబరు 19 వ తేదీన 'ద సర్వెంట్సు ఆఫ్ అన్‌టచ్‌బిల్స్ సొసైటీ' అని నామకరణం జరిగింది. అంటే హరిజనసేవక సమాజం అన్నమాట. ఈ పేరుమీదకూడా కొన్ని అభ్యంతరాలు వచ్చాయి. అందుచేత బోర్డువారు 1932 డిశంబరు 13 న 'హరిజనసేవక సంఘం' అని పేరుపెట్టారు.

దళితజాతులకు 'హరిజనులనే' పేరు ఒక హరిజనసోదరుని సలహాతో గాంధీజీ పెట్టారు. ఎందుకంటే ప్రపంచధర్మాలన్నీ ఈశ్వ

రని నిరాధారులకు ఆధారునిగను, నిరాశ్రితులకు ఆశ్రితునిగను, నిస్స హాయులకు సహాయకునిగను, పేర్కొన్నాయి. భారతదేశంలో అస్పృ శ్యులనేబడేవారిని మించిన నిరాశ్రితులు, నిస్సహాయులు నిరాధారులెవ రున్నారు గనుక? అందుకే యీ మూడవపేరు గాంధీగారికెంతో నచ్చింది. 'అస్పృశ్యతకు విరుద్ధంగా సంఘర్షణచేయుట' అను పేరులో గల బలం, జోరు 'అస్పృశ్యతానివారక'లనేపేరులో లేదని అప్పట్లో రాజాజీ ఆక్షేపించారు కూడాను.

గాంధీగారి మనస్సులో కొంతకాలంనుంచి 'అస్పృశ్యతా నివారణం' ఏ విధంగా జరగాలనే మంథనం జరుగుతూఉంది. ఈ కార్యంలో ప్రవేశించిన కార్యకర్తల మనస్సుల్లో నిజాయతీ, పవిత్రతా సేవాభావాల గాంభీర్యతను, గాంధీజీ చూడాలని తలచేవారు, ఇంకా హింసకు జవాబు హింసతోకాకుండా. విరోధుల మనస్సులను తర్కాల తోను ప్రేమతోను జవాబు జయించాలని కోరుతుండేవారు. ఆఖరికి ఆయన అంతర్వాణి, ఆయనకొక నూతనజ్యోతిని ప్రసాదించింది. ఆత్మశుద్ధికొరకు 21 రోజులు ఉపవసించవలసినదని ఆ అంతర్వాణి ప్రేరణ. ఆ ప్రేరణప్రకారం 1933 మే 8 వ తేదీన ఉపవాసమారంభ మయింది. మహాయజ్ఞపు సెగలు దూరదూర ప్రదేశాలకు పాకి పోయాయి. దీనితో అస్పృశ్యతానివారణ కార్యానికి మంచిబలం జీవము చేకూరాయి. తమతమ హృదయాలంత పరిశుభ్రంగా వున్నవో లేవోనని హరిజనసేవకులు హృదయాలు తడిమిచూసుకోసాగారు. ఆత్మశుద్ధికొరకు చేసిన యీ ఉపవాసవిలువ దేశీయులేగాదు, విదేశీయులు సహితం తెలు సుకోగలిగారు. ఈ సందర్భంలో ఫ్రాన్సుదేశపు ఋషిపుంగవుడయిన రోమియోరోలా గాంధీజీ కిలా రాశాడు:—

'అస్పృశ్యతానివారణ కార్యంలో బాధ కలిగిస్తున్న సంకీర్ణత పోయి దేశీయుల హృదయాలలో ఉదారము, విశాలమైన భావాలూ పుట్టించు శక్తి ఈశ్వరుడొసంగుగాక. తమ ఈ పవిత్రవ్రతం కేవలం అస్పృశ్యతానివారణకోసమే గాక ప్రపంచములో పీడితులు, పీడించేవారు అను రెండు తెగలుగా విడిపోయేటంత ఘోరమైన హింసావృత్తి పెరిగి పోతున్న నేటి సంకటకాలంలో తమ యీ పవిత్ర ఉపవాసం అహింసా దేవి సమక్షంలో గావింపబడుతున్న బలిదానంవలె, సార్వభౌమికమయిన ఆ జీసస్సు శిలువవలె పవిత్రము, పునీతమూ అవునుగాక. ఎందుకంటే ప్రచండమైన నేటి తుఫానునుండి కోట్లాది ప్రజలను రక్షించడానికి తమ మార్గదర్శకత్వమెంతో అవసరము. గాన ప్రస్తుత సమయంలో యీ బలి దానం జరగకుండా చేయుగాక''

కేవలం ఆత్మశుద్ధికొరకు చేసిన ఆ యిరువయ్యొక్క రోజుల ఉపవాసం పూనాలో, ఆ పర్ణకుటీరంలో ప్రశాంతంగా ముగిసింది.

ఇటు గాంధీగారి ఉపవాసం ప్రశాంతంగా ముగిసింది. అటు హరిజనసేవక సంఘ కార్యదర్శి అయిన ఠక్కరుబాపా అత్యంతోత్సాహంతో తన కార్యంలో నిమగ్నులైపోయారు. తన కార్యక్రమ సందర్భంలో అస్పృశ్యతానివారణ గురించి గాంధీజీ ఒకపర్యాయం దేశపర్యటన చేసినయెడల ఈ కార్యానికెంతో బలం చేకూరగలదనే భావం తట్టింది. నిజానికది ఈశ్వరప్రేరితమే కావచ్చును. వెంటనే గాంధీగారికి ఉత్తరం వ్రాశారు. 'కేవలం హరిజనకార్యంకొరకే దేశపర్యటన చేయగలరా?' అని. ఇంకేముంది? అడిగినదే తడవుగా 'ఈ ప్రస్తావన ఎంతయో

ఉత్తమమైనది. కాని పర్యటన ఎక్కడ యే విధంగా చేయాలో కార్య క్రమం వేసిపంపమని' జవాబు వచ్చింది. దేరతో థక్కరుబాపా ఆనందా నికి మేరలేకపోయింది. వెంటనే ఆయాప్రాంతాల ప్రముఖ వ్యక్తులతో సంప్రదించి వారి సలహాలప్రకారం ఒక కార్యక్రమం రూపొందించి పంపించారు గాంధీగారికి.

ఈ హరిజన యాత్ర వార్ధానుంచి ఆరంభమయింది. కాశీనగరంలో సమాప్తమయింది. 12,504 మైళ్ళ ఈ పవిత్రయాత్ర తొమ్మిది మాసాల్లో పూర్తయింది. ఈ యాత్రలో అస్పృశ్యతా విషయమై మూఢనమ్మకాలు వీడమని సవర్ణహిందువులను ప్రార్థించారు గాంధీజీ. దేవాలయాల్లోకి హరిజనులను కూడా వెంటబెట్టుకెళ్ళమని ప్రార్థించారు. సార్వజనికసభల్లో ప్రజల్ని ప్రశ్నించారు.' 'పుట్టుకలో ఎవరేనా అస్పృశ్యులౌతారా? ఒక మానవుని నీడపడినంతమాత్రాన రెండవ మానవుడు అపవిత్రుడెలా అవుతాడు?' హరిజననిధి కొరకు ధనం పోగుచేశారు. ఆ యాత్రలో మొత్తం రు. 8,60,267-0-0 ల ధనం పోగయింది. లక్షలకొలదీ స్త్రీపురుషులు, బాలవృద్ధులు పైసా, అణా, బేడా, పావలాలు గాంధీజీ భిక్షపాత్రలో వేశారు. ఉత్సాహంతో కొంతమంది యువతులు తమతమ బంగారపుగాజులు, మెడలోని హారాలు సహితం గాంధీజీ కర్పించారు. ఈ విధంగా దానం చేసినవారందరూ అస్పృశ్యతానివారణ కార్యంలో సహాయపడినవారే అయ్యారు. అనేక దేవాలయాల్లో హరిజన ప్రవేశాలు జరిగాయి. అనేకమైన జలాశయాలు, సార్వజనికస్థలాలు హరిజనులకొరకు నిరాఘాటంగా తెరవబడినాయి.

కొన్నికొన్నిచోట్ల సనాతనుల అభ్యంతరాలు కలిగించారు. మొంచి బలంగాను, ప్రయత్నపూర్వకంగాను జరిగాయి. ఈ ప్రదర్శన కారులు గాంధీజీ మార్గంలో అడ్డంగా పడుకునేవారు. కొందరైతే గాంధీజీ గారికి నల్లజెండాలు చూపేవారు. కొందరు అల్లరితనంగా పెద్దగోల చేస్తూ, ఈలకేకలేస్తూ గాంధీగారి మాట యెవరూ వినకుండా చేసేవారు. వైద్యనాధ్ థామ్‌లో కొంతమంది పండాలు గాంధీగారి కారుమీద రాళ్ళు విసిరారు. పూనాలో మునిసిపల్ హాలువైపుకు వెడుతున్న గాంధీజీ కారుపైన బాంబు విసిరారు. అదృష్టవశాత్తు ప్రమాదం తప్పింది.

1934 మేనెలలో గాంధీజీ జగన్నాధపురీ చేరుకున్నారు. అక్కడ నుంచి భద్రక్‌వరకు కాలినడకన యాత్రచేశారు. విరోధులను ఓడించ డానికి, వారిని ఛాలెంజి చేయడానికి అది గాంధీజీ నూతన పద్ధతి నిజానికా ఉత్కల పదయాత్ర చరిత్ర ప్రఖ్యాతిగాంచినది. దూరదూర గ్రామాలనుంచి భక్తిభావంతో ప్రజలు తండోపతండాలుగా గాంధీ దర్శనార్థం, ఆయన ఉపదేశాలు వినడంకోసం వస్తుండేవారు. కొన్నికొన్నిచోట్ల అత్యంత భక్తివిహ్వలులై ప్రజలు పుష్పవర్షం కురిపిస్తుండేవారు. ఆ గాంధీనే మరికొన్ని ప్రాంతాల్లో ధర్మద్రోహి, పాషండి, పాపి, నాస్తికుడని నిందించారు. పబ్లిక్ నూతులు, చెరువులు, రేవులు, జలపానగృహాలు హరిజనులకొరకు తెరవడం అస్పృశ్యతానివారణ కార్యాంతర్గతమే ఐనప్ప టికీ నాటి ప్రధాన ప్రవృత్తి హరిజన మందిర ప్రవేశమేనని చెప్పాలి. ఆ కొంతమంది ధర్మకర్తలు అనేక దేవాలయాలు హరిజనులకొరకు తెరిపించారు. అనేకమంది సొంత దేవాలయాలు కూడా తెరిచారు. సంతోష

పూర్వకంగా. కేవలం దక్షిణ ప్రాంతంలో దేవాలయాలు తెరవడానికి మాత్రం వైధానిక అభ్యంతరం చూపుతూవచ్చారు. అగ్రివర్ణాలవారం దరూ ఒక్క మాటమీద సమ్మతించనంతవరకు ఒక్క దేవాలయం కూడా హరిజనులకొరకు తెరవరాదనే అభ్యంతరం వచ్చింది. ఈ అభ్యంతరం శ్రీ రంగాఅయ్యర్ అసెంబ్లీలో ఒక బిల్లు ప్రవేశపెట్టారు. ఆ బిల్లుకు అనుకూలంగా, ప్రతికూలంగా అనేక వాదవివాదాలు జరిగాయి. అనేక వ్యాసాలు రాయబడ్డాయి. మంచి ప్రష్టంభన జరిగింది. పండిత మదన మోహన మాళవ్యాగారికి కూడా అది నచ్చలేదు. విరోధుల ప్రథమ తర్కమేమంటే ఈ బిల్లు హిందూధర్మంలో జోక్యం కలుగజేసుకోరాదన్నదే. ఈ విషయం గాంధీజీ, రాజాజీలు యెంత నచ్చజెప్పినా విరోధులకు అర్థం కాలేదు. కడకది ప్రయోగాత్మకంగా ప్రజాభిప్రాయసేకరణకు పెట్టగా దేవాలయ ప్రవేశ పక్షమే నెగ్గింది. ఐనప్పటికీ విరోధుల కది సరిపడ లేదు. అస్పృశ్యతానివారణ బిల్లు, దేవాలయ ప్రవేశ బిల్లు యీ రెండు ప్రమాదకరమైనవి కానప్పటికీ ఇవి అనవసరంగా మతంలో జోక్యం కలిగించుకుంటున్నవని ప్రజల్లో అపోహ పుట్టించారు. ప్రజాభిప్రాయం కనుగొనడంతో హరిజన మందిర ప్రవేశ సమస్య తీరిపోతుందని కొదిదరు భావించారు. కాని అది పొరపాటయింది. ఎందుకంటే అప్పట్లో అమలునందున్న చట్టాన్ని కాస్త సవరించడంలో చట్టబద్ధమైన అడ్డంకు తొలగిపోయేది.

కొన్ని వర్తి దులవల్లనైతేనేమి, ప్రభుత్వ అస్పష్ట నీతివల్లనైతే నేమి బిల్లుపై చర్చ నిలచిపోయింది. పర్యవసానంగా బిల్లు ప్రవేశపెట్టిన

శ్రీ రంగాఅయ్యర్ విసిగి వేసారి తన చేతులతోనే ఆ బిల్లు తవ్వి పాతి పెట్టారు దీనివల్ల వన దుఃఖం ప్రకటిస్తూ గాంధీజీ "హరిజనసేవక్" పత్రికలో యిలా వ్రాశారు :

"దేవాలయ ప్రవేశ బిల్లు జోరు జబర్దస్తీ యెంతమాత్రం లేదు. రోజూ దేవాలయంలోకి వెళ్ళేవారిలో అధికసంఖ్యాకులకు అభిప్రాయానికి వ్యతిరేకంగా ఒక్క దేవాలయం కూడ తెరవరాదు. సత్యమే అపహాస్యం పాలయితే వేరే మాట. కాని అనుకూల పరిస్థితులలో ప్రజాభిప్రాయాన్ని మేల్కొలపడమంత దుస్తరంకాదు. కడకేమైనాసరే మందిరప్రవేశ సంఘర్షణ కొనసాగవలసినదే. హరిజనులకిచ్చిన వాగ్దాన ప్రకారం దేవాలయాలన్ని వారికొరకు తెరవవలసినదే. చట్టాల పని లేకుండానే మందిరాలు తెరవబడితే సంస్కర్తలకంతకన్నా సంతోషమేముంటుంది? అలవాటుగా దేవాలయాల్లోకి వెళ్ళేవారిలో అధికసంఖ్యాకుల దేవాలయాలు తెరవడానికి సమ్మతించినప్పటికీ వర్తమాన చట్టం దీనికి బాధాకరంగా వుంటుంది. కనుక నూతన చట్టం కావలసివస్తున్నది. అందుకే మరింత శ్రమ పడవలసి వచ్చింది. మందిర ప్రవేశం చేయగోరుతున్నారా? అనే ప్రశ్నకు తావు లేదు. అస్పృశ్యత అనే చెదపురుగు హిందూధర్మంలో ప్రవేశించి దాన్ని లోలోన తొలచివేస్తున్నది, కాన దీపముండగనే యిల్లు చక్కబెట్టుకోని పక్షాన హిందూధర్మం నశించితీరుతుందనే నమ్మకంగల అగ్రవర్ణాలవారి ఆత్మసంతోషంకొరకు యీ పాప పరిహారమంతయూ అవసరము."[1]

బలవంత బ్రాహ్మణార్థంగా మందిరాలు తెరిపించడం గాంధీజీ ఎంత

---

1, హరిజనసేవక్, 7 సెప్టెంబరు 1934.

మాత్రమూ అంగీకరించరు. చదివప్పుడు గాకుండా తెరవడం కూడ ఆయన కిష్టంలేదు. గాంధీజీ సిద్ధాంత ప్రకారం "శ్రద్ధాభక్తులతో ప్రతి నిత్యమూ మందిరానికెళ్ళేవారి ప్రయత్నాల ద్వారానే దేవాలయాలు తెరవబడాలి. ఒక వేళ హరిజనులకు మందిర ప్రవేశం లభించని పక్షంలో అస్పృశ్యత నామరూపాలులేకుండా నశించిందనుకోడానికి వీలులేవని నాగట్టినమ్మకం.", అజ్మీర్‌నుంచి ఒక ఆర్య సమాజ సజ్జనుడు "మందిర ప్రవేశవిషయంలో నేను కాస్త సహాయపడవచ్చునా?" అని గాంధీగారికి రాశాడు. "నీ సహాయమవసరంలేదు. సిద్ధాంతః ఆర్యసమాజకులకు మందిర ప్రవేశం పట్ల విశ్వాసం లేనప్పుడు నీవెట్లా సహాయపడగలవని" గాంధీగారి సమాధానం.

మాకు దేవాలయ ప్రవేశం కావాలని హరిజనులు కోరడంలేదుగదా? మరియు యీ ప్రశ్నకింత ప్రాధాన్యం ఎందుకిస్తున్నారని ఒక ప్రశ్న. దానికి బాపూజీ యిలా సమాధానమిచ్చారు :—"హరిజనులు మందిర ప్రవేశం కోరుతున్నారా లేదా? అనేదిగాదిక్కడ ప్రశ్న. వారు వెళ్ళినా సరే, వెళ్ళకపోయినా సరే వారికొరకు మందిర ద్వారాలు బాహాటంగా తెరిపించడం అగ్రవర్ణాలవారి ప్రథమ కర్తవ్యం. హరిజనుల మందిర ప్రవేశానికడ్డుతగిలే సవర్ణ హిందువుడు తన ధర్మాన్నే కళంకపరుస్తున్నాడని తెలిసికోవాలి. దేవాలయాలకు వెళ్ళే హరిజనులకు భక్తి వుందా లేదా? అని అడగడానికి మనమెవ్వరం? మానవ హృదయ రహస్యం ఒక్క ఈశ్వరునికే ఎరుక. చింపిపీలికలతో వున్న ఒక నిరుపేద హృదయం పవిత్రమైనదేమో! చీనిచీనాంబరాలు, తళుకుబెళుకు దుస్తులు

ధరించిన వాని హృదయానికన్న అనేకరెట్లధిక పవిత్రము, నిర్మలమైన దేమో! ఎవరెరుగుదురు?''

మందిర ప్రవేశం హరిజనులకు ఆర్థిక నష్టం కలిగిస్తుందనే సందేహానికి గాంధీజీ యిలా సమాధానమిచ్చారు :—''మందిర ప్రవేశ సమస్య హరిజనులకు ఆర్థిక నష్టమెట్లా చేయగలదు? వారికి మందిర ప్రవేశాధికారం లభించడంతోనే మిగతవారితోపాటు సంపాదనమార్గాలన్నీ వారికీ లభించగలవు. అప్పుడార్థికనష్ట మెంతమాత్రము కలుగదు.''

హరిజనులకు మందిరప్రవేశమువలన కలిగే లాభములేదు. సంతోషంగా వారు వెళ్ళరు కూడాను అనుకోవడం నిరర్థకం. నిత్యమూ నియమం తప్పకుండా మందిరాలకు వెళ్ళే సవర్ణ హిందువు లెంతమందున్నారు? దేవదర్శనం, పూజచేసుకోడానికి మందిరానికి వెళ్ళగోరే హరిజనుడొక్కడున్నా సరే. అతనికొరకు నిరభ్యంతరంగా మందిర ద్వారాలు తెరవవలసినదే.

1935 మార్చి 10వ తేదీన అరణమూలా (ట్రావన్‌కూర్)లో ఒక హరిజన సమ్మేళనం జరిగింది. అవర్ణసవర్ణులా సభకు అధిక సంఖ్యలో హాజరయ్యారు. ఆ సభకు అమృతలాలు వి. ఠక్కరు అధ్యక్షత వహించారు. అప్పుడు ఠక్కరుబాపాగార్కి యిచ్చిన మానపత్రంలో హరిజనులిలా అన్నారు :—

'మాకొరకు మందిర ద్వారాలు మూయబడి వున్నంతవరకు అంటరానితనం నశించదని మా గట్టి నమ్మకం. అస్పృశ్యతాందోళన సాఫల్యమయిందనుకోడానికి తార్కాణం మా మందిర ప్రవేశమే. స్వేచ్ఛగా

మాకు మందిర ప్రవేశం లభించనంతవరకు, మా పురోభివృద్ధికొరకు జరిగే ప్రయత్నాలన్నీ నిరర్థకమే. సత్యాన్ని మరుగుపరచడమే. కనుక మాకు మందిర ప్రవేశం యిప్పించడంకొరకు హరిజనసేవకసంఘం తన యావత్శక్తినీ ఉపయోగించగలదని నమ్ముతున్నాము. ఇదే మా ఏకైక కోరిక.'

దక్షిణాపథంలో పెద్దపెద్ద దేవాలయ ద్వారాలన్నీ హరిజనులకొరకు తెరువబడ్డాయి. మధుర మీనాక్షి మందిర ప్రవేశదృశ్యం చూచి తీరవలసిన దృశ్యం రాజాజీ ఆ దృశ్యాన్నెంతో చక్కగా వర్ణించారు.

ఇదేవిధంగా ప్రసిద్ధి చెందిన తిరువనంతపురం. కొచ్చిన్ మందిరాలన్నీ గాంధీగారి ప్రేరణ, హరిజనసేవక సంఘ ప్రయత్నాల ఫలితంగా హరిజనులకొరకు తెరవబడ్డాయి. తరువాత పూరీ, రామేశ్వరమ్, ద్వారకా, బద్రీనాథ్ మందిరాల్లో నిరభ్యంతరంగా హరిజనులు ప్రవేశించారు. సుప్రసిద్ధ మందిరాల్లోకల్లా ఒక్క నాథ్ ద్వారా మందిరం మాత్రం మిగిలిపోయింది.

దుర్భేద్యమైన అస్పృశ్యతా దుర్గం మూడువంతులకు పైగా స్వాధీనమయింది. ఐనా అది పూర్తిగా నశించిందనడానికి వీలులేదు. విరోధం కూడా శిథిలపడసాగింది. ఇంతకూ యిది గాంధీయుగపు గొప్ప విజయమనడానికి ఎట్టి సందేహమూ లేదు.

## ప్రాయశ్చిత్తము - తపము

ప్రాయశ్చిత్తం పాపపరిహారార్థానికి తగిన ఉపాయమని అన్ని

ధర్మాలూ అంగీకరిస్తున్నాయి. అస్పృశ్యత హిందూధర్మంలో పెరిగిన పాపమని గాంధీజీ పేర్కొన్నారు. ఇందుకే ఈ పాపపరిహారార్థం హిందూసమాజం ప్రాయశ్చిత్తం చేయవలసినదని చర్వితచర్వణంగా ఎలుగెత్తి చాటారు గాంధీజీ. స్వరాజ్య ప్రాప్తికొరకు లోకమాన్య తిలకు "స్వరాజ్యం నా జన్మసిద్ధమైన హక్కు" అనే మహామంత్రం దేశీయుల కర్ణపుటాల్లో పూరిస్తే, హిందూధర్మం, హిందూసమాజ శుద్ధి కొరకు తగిన బీజమంత్రం "అస్పృశ్యత జీవించి ఉన్నట్లయితే హిందూ ధర్మం నశించడం అనివార్యమని" హెచ్చరిక నిచ్చారు గాంధీజీ.

అహంకారమనే దట్టమైన పొరతో కప్పబడిపోయింది మానవ స్వభావం. అందుకే దాని మరుగులో మానవుడు నాయంతటివాడు లేడని గర్విస్తున్నాడు. అంతేకాదు అమిత ద్వేషాగ్నితో దహించుకు పోతున్నాడు. ఇది కనిపెట్టిన గాంధీజీ కరుణ బుద్ధునివలె రోమరోమము నుండి ఉద్భవించింది. దాని జ్వాలలు మిత్రత్వాన్ని నాలుగువైపులనుండి ముట్టడించాయి. దాని నిర్మూలనోపాయం గాంధీజీకి తట్టింది ప్రాయశ్చిత్త రూపంలో. అస్పృశ్యత మహాపాపమనిన్నీ. అది కేవలం తపస్సు ద్వారానే నశించగలదనిన్నీ ఆయనకు గట్టి నమ్మకం కలిగింది.

అంగిరా మహర్షి ప్రాయశ్చిత్తానిలా వ్యాఖ్యానించారు:—

'ప్రాయోనమ తపః ప్రోక్తం చిత్తం నిశ్చయ ఉచ్యతే,
తపో నిశ్చయ సంయుక్తం ప్రాయశ్చిత్తమితి స్మృతం.'

'ప్రాయస్' అనగా తపస్సు, 'చిత్త' అనగా నిశ్చయం. 'ప్రాయశ్చిత్త్' అనే మాటకు ఆశయమేమంటే మానవుని పాప

ముక్తునిగా జేసే కృత్యమని అర్థం. ప్రాయశ్చిత్త మహిమను గాంధీజీ కూడ అనేకపార్లు పొగిడారు. అస్పృశ్యతానివారణ కది అమోఘమైన ఔషధమన్నారు. 1933 ఏప్రిల్ 7 వ తేదీనాటి 'హరిజనసేవక్'లో గాంధీజీ ఇలా రాశారు:—

నా దృష్టిలో అస్పృశ్యతానివారణమే ప్రాయశ్చిత్తం. అశుచిత్వం ఏ ధర్మానికి సంబంధించిందయినా సరే శుద్ధిలేకుండా అది పరిష్కరింప బడదు. అస్పృశ్యత హిందూధర్మానికి పట్టిన గొప్ప కళంకం. ఈ ఈ కళంక నివారణకొరకు వేలకొలది హిందువులు ఉపవాసం చేసినా, నేను దాన్ని గొప్పగా గణించను. ఇంత గొప్ప ఆహుతికూడా ఆ మహా యజ్ఞానికి పర్యాప్తం కాకపోవచ్చును. మానవుడు ధర్మసంకటంలో పడ్డప్పుడల్లా అతడు ఉపవాస, తపస్సులద్వారానే భగవంతుని ఆరాధించాడు. దానితో అతని ధర్మసంకటాలన్నీ పటాపంచలై పోయాయి.'

గాంధీజీ అస్పృశ్యతానివారణకు తగినమందు తపమేనని గట్టిగా విశ్వసించారు. సరియయిన తపస్సుయొక్క పరిణామం పాపక్షయమువి, పుణ్యసంచయంకొరకు ఎట్టి కష్టాలనైనా సరే సంతోషంగా సహించడమే కాదు. పరమానందంతో వాటిని వరించాలని కూడా ఆయన నమ్మకం. ఏ ప్రవృత్తిమూలంలోనైతే తపమనే రసంపడుతుందో- దాని పుష్పాలలో 'ప్రేమ, మైత్రి' అనే పరాగం దూరదూరాలవరకు వ్యాపించగలదు. దాని ఫలాల్లో కేవలం అమృతమే నిండివుండగలదు.

ఒకవేళ మనం అజ్ఞానంలో గాని లేక అహంకారంతోగాని ఎవరినైనా మనోవాక్కాయకర్మలతోగాని. నీచంగా తలచిన పక్షాన,

ఆతని అంతరాళాన్ని మన నిస్స్వార్థప్రేమ, మైత్రీభావాలద్వారానే స్పృశించాలి. ఈ ఉద్దేశ్యంతోనే ఆశ్రమద్వాదశవ్రతాల్లో స్పర్శభావనకు స్థానమిచ్చారు గాంధీజీ. తర్కాలద్వారాను, చట్టసహాయంతోను కూడా హీనభావంతో వ్యవహరించేవారికి నచ్చచెప్పాలి. పబ్లిక్ నూతులు, చెరువులు, ధర్మశాలలు, హోటళ్ళు, భోజనశాలలు, దేవమందిరాలు హరిజనులకొరకు తెరిపించడం అస్పృశ్యతానివారణ ఒక భాగమేగాని, సంపూర్ణమైనది కాదని కూడా వారికి నచ్చచెప్పాలి. తపస్సాధనలమీద ఆధారపడిన ప్రేమ - తర్కాలద్వారా నచ్చజెప్పినప్పుడే సామాజిక నిరోగ్యతా నివారణకార్యాలు చిరస్థాయి పొందగలవు.

గాంధీజీ కార్యకర్తలకు సత్యం, అహింస, తపస్సుల అవశ్యకతను గూర్చి ఇలా నొక్కిచెప్పారు:—

'అస్పృశ్యతానివారణాందోళన ముఖ్యంగా ధార్మికమే అనుకుంటే ఈ ఉద్యమం ముఖ్యోద్దేశము, హిందూధర్మ శుద్ధిరక్షణే అనుకుంటే ఇందసత్య మెంతమాత్రమూ లేదు. ధర్మానికి నిజమైన ఆధారం సత్యం. సత్యమే ఈశ్వరుడనుకున్నప్పుడు అసత్యానికి స్థానమెక్కడ? అన్న మూలసిద్ధాంతం హరిజనసేవకులందరి హృదయంలో నాటుకుపోవలసినదే. అస్పృశ్యతానివారణలాంటి గొప్ప ధార్మికోద్యమము, పవిత్రమైన సత్యము అనే ధ్యేయముపైననే ఆధారపడినదవాలి. అసత్యమైల అస్పృశ్యతను కేవలం సత్యం నమ్రితలద్వారానే జయించగలుగుతారు. (హరిజనసేవక్, 18-3-1933).

'ప్రజాసేవకునికి శీలసంపద, పవిత్రత అత్యంతావశ్యకమన్నమాట

మరువరాదు. అతనెంత మేధావి అయినా, గొప్పగొప్ప యోగ్యతా పత్రాలు పొందినవాడయినా శీలబలం లేనట్లయితే అవన్నీ వ్యర్థమే, వ్యర్థమేకాదు అరిష్టదాయకాలు కూడాను. ప్రజాసేవకునిలో శీలబలమే లేనియెడల, అతడు పతితుడవడాని కవకాశముంది. అతను పతితుడవడంలోనే ఏ ఉద్దేశ్యంకొరకు పాటుపడుతున్నాడో, ఆ ఉద్దేశ్యం దెబ్బతింటుంది. ఇందుకు సందేహంలేదు. ఇది అందరెరిగినదే.' (II హరిజనసేవక్, 7.11-1936).

'ప్రథమశ్రేణికి చెందిన హరిజనసేవకునికి తనకార్యంపట్ల అభిమానముండాలి, ప్రేమవుండాలి. అవసరమయితే ఆ కార్యంలోనే ప్రాణాలర్పించదానికి సిద్ధపడివుండాలి, అంటరానివారిని హిందూధర్మాన్నుంచి విడదీయరాని అవయవంగా యింతవరకూ లేదు, ఇప్పుడు లేదు, ముందుండబోదనే గట్టి నమ్మకం అతనికి ఉండాలి. అంటరానితనం తప్పకుండా నశించితీరవలసినదే, అది నశించనియెడల హిందూ ధర్మానికి నాశనం తప్పదు. అసత్యంమీద ఆధారపడిన ఏ ధర్మమూ నిలవజాలదు. నిజంగా అసత్యమైనది అస్పృశ్యత.'

'ప్రజాసేవకునికి యిలాంటి గట్టివిశ్వాసమే ఉంటే అతడు తన ప్రాణాలనైనా అర్పించి తన కార్యం సాధించగలుగుతాడు. హరిజనసేవక సంఘంనుంచి లభించే ఆర్థికలాభానికతడు లోబడడు. తన జీవికను గురించి ఆలోచించడు. హరిజనసేవను వృత్తిగా కాదు, ధర్మంగా స్వీకరిస్తాడు. అందతనికి మడతకుడుములు మత్తుగా తినవలసివచ్చినాసరే తన సేవాకార్యం విడిచిపెట్టడు. ఇంకా ప్రజాసేవకుడు తన

కార్యాన్ని రాజకీయ పరిణామాలకొరకు గాక, కేవలం హిందూధర్మ పవిత్రత, పరిమార్జనార్థమే కొనసాగించాలి.'

ఈలాంటి గురుతరమైన మార్గనిర్దేశనం ఒక్క గాంధీజీ తప్ప మరెవరు చేయగలరు? ఈ మార్గదర్శన అభిప్రాయమేమంటే కేవలం ఆత్మశుద్ధి, ప్రాయశ్చిత్తం దృష్టితో పనిచేయగలిగినవారే. ఇందు విహితమైన ధార్మికభావన హృదయంగమం చేసుకోగలిగిన వారే యిందు ప్రవేశించాలి, అలా చేయలేనివాను ఈ సేవాక్షేత్రంలో ప్రవేశించకుండా ఉండడమే మంచిది.

ఈ ఉద్యమం ఒక్క రాజకీయ పాలసీగా భావించేవారు, ఈ క్షేత్రానికెంత దూరంగా ఉంటే అంతమంచిది.

మేం హరిజనోద్ధరణ చేస్తున్నాం, వారిని సంస్కరిస్తున్నాం, గనక వారు మాకు కృతజ్ఞులై ఉండాలనే భావంతో పనిచేసేవారీ కార్యంలో పాల్గొనకుండా ఉండడం మంచిది.

తమ కార్యంతోను, తమ భావాలతోను కలవనివారిపట్ల ఈర్ష్యా ద్వేషాభావాలు గలవారు అస్పృశ్యతానివారణోద్యమానికి దూరంగా ఉండాలి.

ప్రాయశ్చిత్తం, నిస్వార్థభావాలపట్ల గట్టినమ్మకం గలవారే యీ క్షేత్రంలో ప్రవేశించాలి.

ఆచరణ అనే బీజశక్తిలేని ప్రచారకార్యాలు యితరుల నెట్లా ఆకర్షింపగలవు?

గాంధీజీ యిందుకొరకే హరిజనసేవకులకు ఆత్మశుద్ధి ఎంతో అవసరమని నొక్కి నొక్కి చెప్పారు. ద్వేషం, అహంకారం, శీల బల హీనతలు గలవారు అస్పృశ్యతానివారణ ప్రవృత్తిని కలుషితం చేస్తారని గాంధీజీ నమ్మకం

## సత్య సాక్షాత్కారం

బుద్ధభగవానునికి సమ్యక్ సంబోధి దర్శనమైనప్పుడు ఆయనకు నాలుగు ఆర్యసత్యాలు గోచరించాయి:—1. దుఃఖం, 2. దుఃఖనివారణోపాయాలు, 3. దుఃఖనిరోధం, 4. దుఃఖనిరోధమార్గం లేక ఉపాయం.

గాంధీగారికి కూడా సత్యం చతుర్విధరూపాలలో గోచరించిలది:- 1. సమాజంలో పూర్తిగా వ్యాపించిన ద్వేషాగ్ని, 2. దీని మూల కారణం మిథ్యా అహంకారం, 3. ద్వేషాగ్ని నిర్మూలనం, 4. ఆ నిర్మూలనోపాయం, ప్రాయశ్చిత్తం.

రెండున్నర వేల ఏండ్ల తరువాత కలిగిన చారిత్రిక పునరావృత్తి ఎంత విశిష్టమయినది ! ఎంత విలక్షణమయినది !!

## అస్పృశ్యతా వ్యాపకత

గాంధీజీ దృష్టిలో అస్పృశ్యత ఏ వర్గం మేరకో లేక కొంతమంది మానవుల మేరకో పరిమితమైంది కాదు. గాంధీజీ అస్పృశ్యతను సంకుచిత అర్థంలో చూడలేదు. విశాలదృష్టితో పరికించారు. 'మంగళ

ప్రభాతం'లో స్పర్శభావనావ్రత వ్యాఖ్య చేస్తూ అస్పృశ్యతను గూర్చి యిలా చెప్పారు :—''అస్పృశ్యతతో గల చెరుపును అర్థం చేసుకున్న వారికి ఈ కుళ్ళు కేవలం భంగీ-చమార్‌ల మేరకే పరిమితంగాదని తెలియ గలదు. ఆరంభంలో ఈ అంటుజాడ్యం విదేశీయుల పట్ల పుట్టింది. తరువాత అన్యసంప్రదాయాలకు పాకింది. పిమ్మట మతంలోనే ప్రవేశించింది. గాన అస్పృశ్యతా నివారణ చేసే వ్యక్తి భంగీ. చమారులను తమవారుగా భావించడంతోనే తృప్తిపడదు. అస్పృశ్యతా నిర్మూలన మంటే మరేమో గాదు, సంపూర్ణ ప్రపంచ మానవులతో స్నేహం నెరపడమన్న మాట.'' ఈ వ్యాపకతను మరింత స్పష్టపరుస్తూ 23-2-34 నాటి 'హరిజన సేవక్'లో గాంధీజీ యిలా రాశారు :—

'' 'నన్ను ముట్టుకోకు' అనే ఈ అంటురోగం ఒక్క హరిజనుల వరకే పరిమితము కాదు. ఇది, అది అనే తారతమ్యం లేకుండా అన్ని జాతులను, అన్ని ధర్మాలను పీడిస్తున్నది. ఒక జాతి యింకొక జాతికి అంటరానిదైతే, ఒక ధర్మం మరో ధర్మానికి చూడరానిదవుతుంది. గాన యీ ఉద్యమం పర్యవసానంగా విభిన్న జాతుల, సంప్రదాయాలందరి మధ్య పరస్పరం సానుభూతి సామరస్యభావ ముదయించనంతవరకు నేను తృప్తిపడేవాడనుగాను.''[1]

గాంధీజీ అస్పృశ్యతా వ్యాపకత నింకా యిలా వివరించారు :— ''అస్పృశ్యతా గాయం ఎంత లోతుగా పడిందంటే మన రోమరోమాల్లో దాని విషం వ్యాపించిపోయింది. బ్రాహ్మణాబ్రాహ్మణ భేదాలు జాతుల

---

1. హరిజన సేవక్, 23-2-34, పుట 2

జాతుల మధ్య భేదాలు, ధర్మాధర్మాలకు మధ్య ద్వేషాలు, కడకు ప్రాంత ప్రాంతాల మధ్య అఖాతాలు—ఈ భేదభావాల వేళ్ళన్నీ ఈ అస్పృశ్యత లోనే నాటుకుపోయాయి. ఈ అస్పృశ్యతా విషమెందుకుండాలి? మన భారతీయులందరం ఏకపరివారంగా ఎందుకుండరాదు? నిజం చెప్పవలసి వస్తే మానవులందరిదీ ఒకే పరివారం, మనందరం ఒకే వృక్ష శాఖలం గామా?''

నామరూపాలు లేకుండా అంతరానితనం నశించిననాడు ఈ భేద భావాలన్నీ తమంత త్రామే మాయమైపోగలవు. పరస్పరం భేద భావాలు కూడా నిర్మూలనం కాగలవు. కడకు దీని పరిణామం ఏమవు తుందో తెలుసా? పేదసాదల శోషణ బందయిపోతుంది. ఇక్కడక్కడనక సర్వత్రా పారస్పరిక ప్రేమ, సహయోగాలు గోచరమవుతాయి.''1

గాంధీజీ అస్పృశ్యతను సహస్రఫణుల సర్పంతోను, సహస్ర ముఖాల రాక్షసితోను పోల్చారు. అంటే దీనికనేక రూపాలున్నాయన్న మాట. ఎక్కడ కాస్త చోటు దొరికితే అక్కడే వెళ్ళి కూర్చుంటుంది. క్రమక్రమంగా ఏవగింపుకు ప్రతిఏవగింపు, ద్వేషానికి ప్రతిద్వేషం పుట్టుకొచ్చాయి. ఒక ధర్మం మరొక ధర్మాన్ని, ఒక సంప్రదాయం ఇంకో సంప్రదాయాన్ని నీచంగా చూడసాగాయి. ఈ విధంగా మెట్టు తరువాత మెట్టు ఉచ్చనీచ భావాలు పెరగసాగాయి. ఈ పరిస్థితి ప్రపంచంలో అన్నిచోట్లా వుంది. ధార్మిక, ఆర్థిక, సామాజిక, రాజకీయ క్షేత్రాలన్నింటిలోను కొద్దిగానో, గొప్పగానో ఈ భావాలు వ్యాపించిపోయాయి. ఈ భావాల నొక్కొక్కటిగా సమూలంగ నాశనం

1. హరిజన సేవక్, 10-2-46, పుట 5

చేయాలని తలంచారు బాపూజీ. ఎవరినైతే మనం సూన్యదృష్టితో చూస్తామో, వారి దృష్టి కూడా మనపట్ల అలానే వుంటుంది. వారిలో ఈ భావం కొంతకాలంపాటు అణిగివున్నా, సమయం చిక్కడంతోనే అది పైకుబుకుతుంది. ఏవగింపు తీగవలె వీలయినచోటల్లా అలుముకుపోతుంది. దానికి ఉదాహరణలు అనేకంగా వున్నాయి. బ్రాహ్మణులకు 'పరియా' ఏ విధంగా అంటరానివాడో, అదే విధంగా 'పరియా'కు బ్రాహ్మణుడస్పృశ్యుడు. పరియా లేక హోలెయాజాతి పేట మధ్య నుంచి నడిచివెళ్ళే బ్రాహ్మణునికి బడితపూజ జరుగుతుండేది. బ్రాహ్మణులు నడిచివెళ్ళిన మార్గాలలో ఆవుపేడ కళ్ళాపు జల్లుతుండేవారు పరియాలు.1 ఇదేవిధంగా 'ఎర్లమ్' అనే జాతి బ్రాహ్మణుల చేతి అన్నం తినరు. వారి వస్తువులను ముట్టుకునేవారుకారు. తమ శుభాశుభ కార్యాలకు బ్రాహ్మణుని పిలవవలసివస్తుందనే కారణంగా వివాహాల్లో హవనక్రియ జరపడమే మానుకున్నారు.2 హోలెర్ జాతి గృహాలు బ్రాహ్మణుల స్పర్శకు అపవిత్రమైపోయేవి.3 పులినిచూచి నక్క వాత పెట్టుకున్నట్టు, పెద్దజాతులవారి అనుకరణలో చిన్నజాతులవారు కూడా పరస్పర ఉచ్చనీచ భావాలు అమలుపరచసాగారు.

---

1. థర్స్టటన్, పుట 88 (క్షితిమోహన్‌సేన్ రచన: భారతదేశంలో జాతిభేదం)
2. థర్స్టటన్, వుట 100.
3. మైసూర్, పుట 344. క్షితియోహనసేన్ భారతదేశంలో జాతి భేదం. పుట 101.

'క' నీచంగా తలుస్తాడు 'ఖ' కాస్త మేలుకున్న తరువాత లేక వారి వత్తిడినుండి ముక్తిపొందిన పిమ్మట 'ఖ' ప్రతిక్రియా భావంతో 'క' నీచంగా చూడసాగాడు. ఇది స్వాభావికం. కానీ వాంఛనీయం మాత్రం కాదు. ఈ రివాజును అస్పృశ్యతస్థాన పరివర్తనమనే చెప్పాలి. ద్వేషం ద్వేషంతో తగ్గదు. ఆ ద్వేషంతో అంటే ప్రేమతో తగ్గుతుందనే బుద్ధుని సిద్ధాంతం పట్ల గాంధీజీకి దృఢమైన విశ్వాసం. ప్రేమమార్గమే అన్నివిధాల అంటరానితనాన్ని రూపుమాపడానికి సరిఅయినమార్గం. కానీ కొందరి దృష్టిలో యిది వ్యర్థమైన మార్గం. గాంధీజీని శుద్ధ ఆదర్శవాదిగా మనం తలవరాదు. సత్యప్రయోగాలలో ప్రతి ఒక్క దానిలోను ఆయన వ్యవహారబుద్ధి స్పష్టంగా గోచరిస్తుంది. అస్పృశ్యత ప్రసారం నిలిపే పద్ధతిలో దాని వ్యవహారిక పక్షంమీద గాంధీజీ సదా దృష్టి నిలిపి వుండేవారు. ఇందుచేతనే హిందూసమాజంలో లోతుగా వ్యాపించిన అస్పృశ్యతను నివారించే విషయంలోనే ఆయన యావత్ శక్తినీ కేంద్రీకరించారు. చరమ లక్ష్యాన్ని చేరుకోడానికిది ఆఖరిమెట్టు. ఈ మెట్టు మీద గట్టిగా పాదమాని మానవమాత్రులపట్ల సమతాప్రేమభావాలు సాధించడమే గాంధీజీ గురుతరలక్ష్యం.

## అస్పృశ్యతను గురించిన కొన్నిసూక్తులు

1921 నుండి 1946 వరకు అప్పుడప్పుడూ 'యంగ్ఇండియా' హిందీ నవజీవన్, హరిజన్, హరిజనసేవక్, పత్రికల్లో అస్పృశ్యత

దాని నివారణ విషయంలో గాంధీజీ వెల్లడించిన కొన్ని భావాలను దిగువ పొందుపరుస్తున్నాము:—

"నేనొకసారిగాదు, అనేకసార్లు చెప్పాను, అస్పృశ్యతా నివారణ నా ప్రథమ కర్తవ్యంగా తలుస్తానని. రేయింబవళ్ళు అస్పృశ్యతా నివారణగురించి ఆలోచించనంతవరకు నన్ను నేను నిజమైన హిందువుడ నని చెప్పుకోలేను.''

'అంటరానితనం శాశ్వతంగా వుండేపక్షాన మన నాశనం తప్పదు. హిందూధర్మంకూడ నశించితీరుతుంది. లోకంముందు మనకు తలవంపు లవుతాయి. మనల్ని చూచి లోకం నవ్వుతూ, పరిహసిస్తుంది.'

'అస్పృశ్యతానివారణోద్యమం కేవలం ధార్మిక కర్తవ్య ప్రమేయమే. ప్రాయశ్చిత్త ప్రమేయమేగాని, రాచకీయ హేతువెంత మాత్రమూ లేదు. ఈ ఋణం తీర్చుకోలేకపోయినట్లయితే ఈశ్వరుని ముందు గొప్ప అపరాధులమవుతాము. హిందువులుగా ఉండలేము. మానవులుగా కూడా వుండలేము.'

'ఫలానా వ్యక్తి ఫలానాజాతిలో పుట్టాడు, కాబట్టి అతడు అంటరానివాడు అనే నమ్మకం సృష్టినియమానికి, దయాధర్మానికి, శాస్త్రవచనాలకూ విరుద్ధమైనది.'

'ఆత్మ ఒక్కటే! సమస్త శరీరధారుల్లోనూ అదే వసిస్తున్నప్పుడు అస్పృశ్యులెవరు? స్పృశ్యులెవరు?'

'మనం వారిని తిరస్కరించాం, ఊరివెలుపల ఉంచాం, పరిశుభ్రంగా వుండడానికవకాశమివ్వలేదు. మీరు మిక్కిలి అశుభ్రంగాను, అసభ్యంగాను వుంటారని వారిని నిందిస్తున్నాం. ఇది హద్దుమీరిన అన్యాయం కాదా?'

'ఇరువదినాలుగుకోట్ల హిందువులు తమ ఐదవభాగాన్నిలా అణచిపెట్టి ఉంచుతున్నారు. ఇది స్వరాజ్యంకాదు రాక్షసరాజ్యం. ఇది ధర్మం కాదు అధర్మం.'

'హిందూధర్మంలో కేవలం అంటరానితనం. ఉచ్చనీచ భావాలే మిగిలాయి. ఎవరికి వారే మేం కులీనులం. మీరు నికృష్టులు కనుక మీ చేతి అన్నం ముట్టం, నీళ్ళు త్రాగం అని భావిస్తున్నారు, ఇందులో ధర్మమెక్కడా అవుపడదు. సరిగదా నవ్వులపాలవుతున్నాం.'

మందిరప్రవేశ నిషేధం అనేది అస్పృశ్యత స్థిరంగా నిలచి వుండానికి ఒక ఉపాయం. ఈ ప్రతిబంధం తొలగిపోయిననాడే అంటరానితనం మొదలంట నశిస్తుంది.'

'రోగులు హరిజనులు కాదు. ఒకవేళ హరిజనుడే రోగి అనుకుందాం. ఐతే దానికి తగిన ఔషధం సవర్ణహిందువులే. అసలు జబ్బుచేయడం అగ్రవర్ణాలవారికే. కాని మేం రోగులమని వారు ఒప్పుకోవడంలేదు. పైగా ఈ రోగి చికిత్సకునిమీద గుద్దులుజేస్తున్నాడు. అది వైద్యుడు లెక్కపెట్టడంలేదు. కాని వారినతడు హెచ్చరిస్తూనే వున్నాడు. 'నీ యింటికి నిప్పంటుందోయ్ నిప్పు' అని.'

'హరిజనులను మనలో కలుపుకున్న తరువాత వారిని వేరుగా పెట్టం, సరిగదా వారి అలవాట్లను, వారి దురవస్తను సంస్కరిస్తాము. నేడు వారిని బహిష్కరించి. అత్యాచారాల పాలుజేసి, హింసించి సమాజం పట్ల ద్రోహంచేస్తున్నాం. హిందూధర్మ మూలసిద్ధాంతాలను విరాదతణ చేస్తున్నాం.'

'నిజానికి అస్పృశ్యత మన హృదయాలలోనే వుంది. 'ఇతడు అంటరానిజాతిలో పుట్టాడు గాన యితణ్ణి నేను ముట్టుకోను' అనడం మహాపాతకం, అహంకారం, ఇది అధర్మం, అసత్యమూను.'

'హిందువులయిన ప్రతిఒక్కని పరమకర్తవ్యమేమంటే కోట్ల కొలది హిందువులకు ప్రశాంతస్థలాలయిన మందిరాల్లో ప్రవేశించే అధికారం హరిజనులకు యిప్పించడమే.'

'అస్పృశ్యతను పాటించడం, హిందూధర్మాన్ని రక్షించడం, ఇవి రెండూ పరస్పర విరోధభావాలు గాక మరేమిటి ?'

'అంత్యజులను అవమానపరచడం నేనెంతమాత్రమూ సహించలేను. హరిజనులను విడిచి ఇహలోక పరలోకరాజ్యాలు రెండూ లభించినా, నే నంగీకరించను.'

'అస్పృశ్యత అంతంచేయడం బలత్కారంతో కాదు. సత్యాగ్రహం, ప్రేమాగ్రహంతో అపగలదు. ధర్మసంస్కారం, కష్టసహనం. తపస్సులద్వారానే జరగాలి. దుఃఖం, క్రోధం, తిరస్కారాల ద్వారా సంస్కార మెంతమాత్రమూ జరగనేరదు, సత్యవిరోధులపట్ల మనస్సులో దుర్భావన జనించకపోవడమే సత్యాగ్రహుని ధర్మం.'

'ఉచ్చనీచ భేదభావాలమీద ఆధారపడిన ధర్మం నశించడమే అన్ని విధాల శ్రేయస్కారం.'

'నేడు మీరు పాలనజేస్తున్న ధర్మం తప్పకుండా నశించిపోవడమే మంచిది. ఈశ్వరుని నేను ప్రార్థిస్తుదేమంటే, ఇదే హిందూధర్మమైతే దీని నాశనం తప్పనిసరిగా కావాలనే. ఇది నా నమ్మకం.'

''అస్పృశ్యతా అభిశాపంతోనే అంటిపెట్టుకు కూచున్నామంటే మనం లోకనిందకు పాత్రులమౌతాము. ఆ అభిశాపాన్ని సమర్థించి పోషించే ధర్మాన్ని లోకం నిందిస్తుంది''

''నేను పవిత్రించ ధర్మ గ్రంథాల సారాంశం తెలుసుకోడానికి యత్నిస్తున్నాను. వాటి తాత్పర్యం తెలుసుకోడానికి సత్య, అహింసల గీటురాయిని ఉపయోగిస్తున్నాను. ఆ గీటురాయి కూడ ఆ ధర్మ గ్రంథాల ద్వారానే లభించింది. ఆ గీటురాయికి సరిపడినవే నేను స్వీకరిస్తాను. మిగతావాటిని విడిచిపెడతాను.''

''హిందూ ధర్మభావం నాలో తొణికిసలాడుచున్నది. అందుకే అంటరానితనాన్ని సహించలేకపోతున్నాను. నేడు మనం పాటిస్తున్న అస్పృశ్యత హిందూ ధర్మశాస్త్రాలుగా ప్రసిద్ధి చెందిన ఏ గ్రంథంలోనూ కనుపించడంలేదు. నిజానికి వీటిలో ఏ ఒక్క గ్రంథమైనా అస్పృశ్యతను సమర్థించినట్లు నా కగుపడితే, నేనా హిందూ ధర్మాన్ని త్యజించడానికి వెనుతీయను. ఎందుకంటే నిజమైన ధర్మ శాస్త్రం సదాచార, నీతిశాస్త్ర మూలసిద్ధాంతాలకు విరుద్ధంగా ఉండదని

నా నమ్మకం. అంటరానితనం హిందూధర్మంలో భాగం కాదు. కాబట్టే నేను దీని వెంటబడ్డాను. కాని ఒక్క సంగతి. ఈ భయంకరమైన పాపానికి నా ఓర్పు దినదినం క్షీణిస్తున్నది.''

''నా మనస్సునెప్పుడూ అస్పృశ్యతతో సమన్వయపరచుకోలేక పోయాను. అది సదా హిందూధర్మానికి కళంకమనే నమ్ముతున్నాను.''

''హిందూధర్మాన్ని నా ప్రాణాలకంటే ఎక్కువగా ప్రేమిస్తున్నాను. అందుకే ఈ అస్పృశ్యత నాకు సహించరాని భారమయింది. మన జాతిలో ఐదవ భాగం ప్రజలకు మనతో సమానాధికారాల నివ్వడం లేదంటే అర్థమేమిటి? ఈశ్వరాస్తిత్వమే అంగీకరించడంలేదన్నమాటేగా!''

'' 'ఎక్కడున్నావే గొంగళీ అంటే వేసినకాడే వున్నా'ననే స్థితి హిందూధర్మమంగీకరించదు. జ్ఞానం, అనంతం, అపారమయిందీను. సత్యం కూడా అలాంటిదే. ప్రతి దినం మనం మన ఆత్మశక్తిని, జ్ఞానాన్ని వృద్ధిజేసుకుంటున్నాం; చేసుకుంటాం కూడాను. ఒక్కొక్క అనుభవం ఒక్కొక్క నూతన కర్తవ్యాన్ని సూచిస్తుంది. కాని సత్యం మాత్రం సదా స్థిరంగా ఉండేదే.''

''కేవలం స్వార్థానికి దాసులమై మనల్ని మనం కులీనులమని, ఇతరులు నీచులని తలపడం మహాచెడ్డతనం. అంటరానితనంలాంటి చెడ్డతనాన్ని హిందూధర్మంతో జతపరచడం మహాచెడ్డతనమేగాదు. దానికి రెండంతలు, మూడంతలు చెడ్డతనం. మనకింత నగ్నంగా కనుపిస్తున్న అస్పృశ్యతా దోషాన్ని విద్వాంసులు, విజ్ఞులు శాస్త్రప్రమాణాలు ఏకరువు పెట్టి ఋజువుచేయజూడడం చూస్తే, నా హృదయం వేదనపడుతుంది.

హిందువులనబడే మనం నేడొక ప్రమాదకర పరిస్థితిలో వున్నామని నేనెప్పుడూ చెబుతూనే వున్నాను. నేడు ఇంకొకసారి హెచ్చరిస్తున్నాను. మనం కోరుకున్నా, కోరుకోకపోయినా అంటరానితనం మాత్రం నశించి తీరుతుందిలెండి. కాని ఇక్కడొక విషయం మనం మరువరాదు. అదేమంటే ఈ పరీక్షాసమయంలో మన పాపపరిహారార్థం గనక ప్రాయశ్చిత్తం చేసి తద్వారా మనల్ని మనం సంస్కరించుకొని, శుద్ధి పరచుకోగలిగితే హిందువుల ఈ ఆత్మశుద్ధీకరణ, ఉదారత చరిత్రలో పేరు సంపాదించుకోగలదు. ఆ! ఇంకొక విషయం కాలప్రవాహ వత్తిడిలో పడి, వివశులమై, బలవంతంగా మనస్సు మార్చుకుంటే కాల ప్రవాహ బలంతో హరిజనులే గనక తమ అధికారాలు పొందగలిగితే, అప్పుడా శ్రేయం హిందువులకు, హిందూధర్మానికిగాని ఎంతమాత్రమూ దక్కదు. కాబట్టే నేనొక అడుగు ముందుకొచ్చి చెబుతున్నాను. 'ఈ పరీక్షలో మనం ఓడిపోతిమా, హిందువుల హిందూధర్మ నాశనం తప్పదు' అని."



# 4

## స్వరాజ్యంలో కూడా అస్పృశ్యతేనా?

1947 సం॥రంలో దేశానికి స్వరాజ్యం వచ్చింది. మనం స్వతంత్రులమయ్యాం. దేశవిభాజన ఫలితంగా కొత్తకొత్త బాధ్యతలు మనమెత్తినపడ్డాయి. స్వరాజ్యానికి పూర్వం అప్పుడప్పుడూ మనం చేసిన వాగ్దానాలు, చెల్లించవలసినది. అందులో 'పూనా ఒడంబడిక' ఒకటి. దీనిమీద మన నాయకులు 15 ఏళ్ళపూర్వం 1932 సెప్టెంబరు 24వ తేదీన తమ ముద్రవేశారు. ఆ ఒడంబడిక గడవు పదేండ్లు మాత్రమే. ఈ అవధిలోపలే అస్పృశ్యం అంతం కావచ్చని అంతా భావించారు. 1933 సెప్టెంబరు 25వ తేదీన పండిత మదనమోహనమాళవ్యాగారి అధ్యక్షతలో బొంబాయినగరంలో విశాలమైన సభ జరిగింది. ఆ సభలో యిలా చెప్పబడింది:—'స్వరాజ్య పార్లమెంటు చేయవలసిన మొదటి కార్యం రాజ్యాంగంద్వారా అస్పృశ్యతను తుదిముట్టించడమే' గాన ఆ ప్రకారంగా రాజ్యాంగసభ తన పూర్వసంకల్ప ప్రకారం రాజ్యాంగంలో 17 వ అనుచ్ఛేదం ద్వారా అస్పృశ్యతను యీ విధంగా అంతమొందించింది:—

'అస్పృశ్యత అంతమొందించబడినది. ఏ రూపంలో కూడా అస్పృశ్యత నమలుపరచుట నిషేధింపబడినది. అస్పృశ్యతా జనిత

నిర్యోగ్యతలు పాటించడం అపరాధం. అలా పాటించువారు చట్టప్రకారం దండనార్హులవుదురు.'

ఈ సాంఘిక దురాచారాన్ని నిర్మూలించే ప్రయత్నాల కనేక విరోధభావాల నెదుర్కొనవలసిరావడం ఎంతో ఆశ్చర్యదాయకం. దాన్నంతమొందించే అనుచ్ఛేదం యే విధమైన అభ్యంతరాలూ లేకుండా సర్వసమ్మతితో అంగీకరించబడింది.

వెనుకబడినజాతుల హితసాధనా విషయంలో 16 వ అనుచ్ఛేదం కూడా గొప్పకార్యం చేసింది. దాని సంబంధం రాజ్యాధీనంలో గల ప్రజాసేవా కార్యాల్లో అవసర సమత 'కేవలం ధర్మం. జాతి, మూల వంశం, స్త్రీ పురుష వివక్ష, పుట్టుక, జన్మస్థానం, ఉనికి లేక వీటి యే ఒక్కటి కూడా ప్రజాసేవక కార్యాలు లేక పదవుల విషయాంలో అయోతలుగా పరిగణించబడవు.'

ఇంకా రాజ్యాంగంలో 46 వ అనుచ్ఛేదంలో యిలా ప్రకటించబడినది:

'ప్రభుత్వం బలహీనసముదాయాలు—ముఖ్యంగా నిమ్నజాతుల, ఆదిమజాతుల—విద్య, ఆర్థిక అభివృద్ధులను దృష్టియందుంచుకొనును. సాంఘిక అన్యాయాలు మొదలయిన శోషణలనుంచి వారిని రక్షించును.

రాజ్యాంగంలో 330 వ అనుచ్ఛేదం ప్రకారం నిమ్నజాతుల, ఆదిమవాసుల ప్రతినిధులకొరకు లోకసభలో స్థానాలు ప్రత్యేకించబడ్డాయి. ఇంకా 332 వ అనుచ్ఛేదంద్వారా ప్రాంతీయ అసెంబ్లీలో నిమ్నజాతుల కొరకు స్థానాలు ప్రత్యేకించబడ్డాయి.

సంవిధానంద్వారా అంటరానితనం అంతమొందించినప్పటికీ, అస్పృశ్యత అపరాధచట్టం పాసవడం అత్యంతావశ్యకం. దానికి చాలా గడవు పట్టింది. 1955 లో ఆ అవసరమైన చట్టం పాసయింది. ధార్మిక, సామాజిక, నిరోగ్యగ్యతలు పాటించినవారికి, చికిత్సాలయాలలో చేర్చుకో నిరాకరించినవారికీ, వస్తువులనమ్మకోవడం, ప్రజాసేవాకార్యాలు చేయ నడ్డుపెట్టువారికీ, ఇలాంటి అస్పృశ్యతా జనిత అపరాధాలకు దండన విధానం ఆ అపరాధ అధినియమంలో చేయబడింది.

కాని అస్పృశ్యతా అపరాధ నియమం అమలు అంతంత మాత్రమే అయింది. కావలసిన చురుగ్గా దాని ప్రచారం కాలేదు. చాలా తక్కువగ పోలీసుకేసులు జరుగుతున్నవి. అనేకసమస్యలు విచారాధీనమై కోర్టులో పడివున్నాయి. పీడిత హరిజనులు కోర్టుచుట్టూ తిరిగితిరిగి విసిగివేసారి, లేక యితరుల ఎత్తిడికి లోనయి, తమతమ కేసులు వాపసు తీసుకుంటారు, అథవా వివశులై సమాధానపడుతున్నారు. నిమ్నజాతుల, ఆదిమజాతుల కమీషనరు తన 1965-1966 వ రిపోర్టులో యిలా వ్రాశారు:—'1955-56 మధ్య అనగా పదేండ్లలో కేవలం 4540 పోలీసుకేసులు నమోదు చేయబడ్డాయి. వీటిలో 3956 కేసులు కోర్టుకెక్కాయి. 1058 కేసుల్లో అపరాధులు శిక్షపొందారు. 712 కేసుల్లో అపరాధులను విడిచిపెట్టారు. 828 కేసుల్లో సంధి జరిగింది. 1271 కేసులు విచారాధీనంలో వున్నాయి.'

కేవలం చట్టబలంతో అంటరానితనం నశించడం కల్ల. ఐనా పీడిత హరిజనులకు చట్టసహాయం పొందే అవసరాలు రాకమానవు.

ఆలాంటప్పుడు వారికి సహాయపడడం కార్యకర్తల ప్రథమ కర్తవ్య మవుతుంది. అవర్ణ సవర్ణులమధ్య స్పర్థలు పుట్టకుండాను, ఒకవేళ పుట్టిన అవి శృతిమించకుండాను వుండేటట్లు చేయడంలో కార్యకర్తల కర్తవ్యమెంతేనా వుంది.

హరిజనుల, ఆదివాసుల పురోభివృద్ధికొరకొక కమీషనుకూడ వున్నది. దాని కమీషనరు ప్రతియేటా తన రిపోర్టును రాష్ట్రపతి కర్పిస్తూవుంటాడు. దానిమీద కేంద్రశాసనసభలో చర్చలు జరుగుతుం టాయి. ఆ రిపోర్టులో అస్పృశ్యత ప్రచలన సర్వే చేయబడుతుంది. హరిజనుల, ఆదివాసుల శైక్షణిక, సామాజిక, ఆర్థిక పురోభివృద్ధికి సల హాలు, సూచనలు వుంటాయి. అస్పృశ్యతానివారణ, అభివృద్ధికొరకు గాను కేంద్ర ప్రాంతీయప్రభుత్వాలు, హరిజనసేవకసంఘం, ఇంకా ఇలాంటి వనేక సంస్థలకు కొన్నేండ్లనుంచి ఆర్థికసహాయం చేస్తున్నాయి.

హరిజనసేవకసంఘ కార్యకర్తలు సఘనక్షేత్రాల్లో పనిచేస్తు న్నారు. వారు హరిజనులకొరకు సార్వజనిక నూతులు, చెరువులు, నీలాటిరేవులు, జలపాన గృహాలు, మంగలిషాపులు, తెరిపిస్తున్నారు, చాకళ్ళు వారిబట్ట లుతికేటట్టు చేస్తున్నారు. ఈ దృష్టిలో కార్యకర్తల శిబిరాలు, సేమినార్లు మొదలైన యెర్పాట్లు చేయబడుతున్నాయి. కొన్నికొన్నిచోట్ల సేవకులు పదయాత్రలు చేస్తున్నారు ఆ యాత్రల్లో అస్పృశ్యత, విద్య, ఆర్థికపరిస్థితుల సర్వేక్షణ కూడా చేస్తుంటారు.

దళితవర్గ సంఘం హరిజనుల్లో పరస్పరభేదభావ నిర్మూలనం, వారిలో జాగృతి మేల్కొలిపే పని చక్కగ చేస్తున్నది.

# భంగి ముక్తి

నేటి సమాజంలో 'భంగీముక్తి', లేక 'భంగీ కష్టముక్తి' విషయాలు ఎంతో ప్రాధాన్యం వహించాయి. కనుక వీటి నివారణార్థం హరిజనసేవకసంఘం, గాంధీస్మారకనిధి తరపున సఫాయి సేవకులకు ప్రశిక్షణ యివ్వడంకొరకు పలుచోట్ల సఫాయి విద్యాలయాలు, శిబిరాలు విరివిగా నడుస్తున్నవి.

నిమ్నజాతుల్లో భంగీలస్థానం అత్యంత నీచమైనదిగా ఎంచబడింది, కారణం అది మలమూత్రాలనెత్తేపని గనక. వారు ఆ పనిగతిలేక చేస్తున్నారు, అదే వారి కులవృత్తయింది. ఇది యితర జాతుల వారెవరూ చేయగొరనిపని. చర్మం బాగుచేసేపనికూడా ఏహ్యంగానే ఎన్నబడింది. గాన చర్మకారులా వృత్తిని త్యజిస్తున్నారు. ఈ వృత్తిని యితర జాతులవారు కొందరు స్వీకరిస్తున్నారు. కాని మలమూత్రాల నెత్తేపని చేయడానికెవరూ తయారౌడంలేదు. ఈ పని మనదేశంలో జరుగుతున్నంత అసహ్యకరంగా యింకే దేశంలోనూ జరగడంలేదు. ఇతరు లెవరూ నిచ్చగింపని పని పాపం భంగీలు చేస్తున్నారు. అందుకు అస్పృశ్యతా దోషం వారి నెత్తిన రుద్దుతున్నాం, ఇది యెంత అనుచితకార్యం? గాంధీజీ ఒకవ్యాసంలో 'మనమంతా భంగీలమేల కాగూడదు?' అని వ్రాశారు. గాంధీజీ అనుయాయులు కొందరీ వృత్తి నవలంభించారు. అందుచేత ఆ పనిలో కొంత సంస్కరణ కూడా జరిగింది. ఐనప్పటికీ సామూహికరూపంగా యీ పని ఒక్క భంగీ సమాజం తప్ప మరే సమాజమూ చేయడానికి అంగీకరించడంలేదు,

లోగడకంటే యీ పాకీదొడ్లలో కాస్త పరివర్తనం కలిగినమాట వాస్తవం. వైజ్ఞానికపద్ధతులు కొన్ని అమలుకొచ్చాయి. భంగీ కష్ట విముక్తి విషయంలో యిది కొంత శుభసూచకమే, కాని ఒక్క విషయం. మలమూత్రాల నెత్తేపని సమాజంలో యెవరికీ కులవృత్తి కాగూడదు. ఆ పనిచేసే ప్రత్యేకకులం ఉండకుండా చేయడమే భంగీ ముక్తి ఆశయం. శ్రీ రాధా ధర్మాధికారిగారి అన్నట్లు 'సభ్య సమాజానికి కసాయిపని ఏ విధంగా లాంఛనమైనదో అదేవిధంగా 'భంగీ శబ్దం, భంగీజాతి కళంకమైనవే, సమాజం యీ రెండువృత్తులను నీచంగా తలవనిపక్షంలో కసాయిపని. మలమూత్రాల నెత్తే పని చేయడానికి యే వ్యక్తీ వెనుకాడదు. నా కొడుకు శవం కాలుతున్న చితాగ్నికో పులగం ఉడికించుకుని తినడానికీ మనం తయారైతే, భంగీ, కసాయిపనులు చేసుకోడానికి సందేహమేల? కాని ఇంత పరివర్తన్న కలగడం కష్టం. అలాంటప్పుడు ఆ యేహ్యకార్యం చేయడానికి ఇతరులనెందుకు పెశపరచాలి?'

'నిజానికి భంగీల కష్టాలు కొన్ని నివారించవలసినదే. అది వారు కోరుతున్నారు కూడాను. ఉదాహరణకు:—వారి వేతనవృద్ధి చేయవచ్చును. పరిశుభ్రమైన వసతులు కల్పించవచ్చును, వైజ్ఞానిక సాధనాలు యివ్వవచ్చును. కొన్ని అన్నిటికంటే దుష్కరమైన కార్యం అందున్నకష్టాలు వారికి కష్టాభూతులే కావడంకద్దు. యుగయుగాలనుంచి, పరంపరాగతంగావస్తున్న వరికరాలతో. ఆ యేహ్యకార్యంచేస్తూ, చేస్తూ, వారి స్వాభిమానం నశించిపోయింది. అందుచేత వారికి మీరుకాకపోతే మీసంతానాన్నైనయినా ఈ పాడువృత్తినుంచి రక్షించమని నచ్చజెప్పాలి. వీలయినంత త్వరలో భంగీల సంతానం విద్యా

సంస్కారాలలవడజేసుకుని, 'యీ రోతపని మేంచేయమని నిరాకరించే వారిసిగా తయారుచేయాలి. ఈ కార్యం ప్రభుత్వం, ప్రవేటు సంస్థ ద్వారాజరగాలి.

కిశోరీలాల్ మశ్రూవాలా "భంగీల సందిగ్ధత" అనే వ్యాసం 1949 ఏప్రియల్ 11వ తేదీ 'హరిజన్ సేవక్' లో వ్రాశారు. ఆయన వాల్మీకి వంశజుని నోట ఇలా చెప్పించారు:—

"మాభవిష్యత్తును గురించి గాంధీజీ ఒకరూపకల్పనచేసారు. ఆ రూపం మాకెప్పుడు లభిస్తుందో చెప్పలేం.

ఇరుకైన సందుగొందులే మా నివాసాలు గావచ్చు లేక లైబ్రేరీలు ఉద్యానాల లాంటిచోట్లు మా నివాసాలు గావచ్చును. ఈ రెండూగాని పక్షంలో మేము మావృత్తినే విడిచి మరొక వృత్తి నవలంబించ వచ్చును శ్రీ జగజీవనరామ్, వినోబాగార్లుకూడా త్వరలోనే మాకు మంచిరోజులు రానున్నవవి ఆశించకుండానే మమల్ని యీ మురికి పని విడిచి యింకో పని అవలంబించమని సలహానిచ్చారు. ఈ సలహాలో మాపట్ల వారికి గల సానుభూతి విదితమౌతున్నది. కాని మాకు వేరేగత్యంతరం లేదుకదా? ఈ వృత్తిని విడిచిపెడితే మాకు రెండోవృత్తి ఏది? మమ్మెవరైనా నౌకర్లు గాపెట్టుకుంటారా? అగ్రజాతులవారు ఏఏకార్యాల్లో మమ్మల్ని సహాయం గా తీసుకుంటారు? వారిలో ఎవరో ఒకరిద్దరు ఉదారహృదయములు, మా బిడ్డల్లో తెలివిగల ఒకరిద్దర్ని ప్రేమించవచ్చును, వారిని వృద్ధికి తేవచ్చును కాని మిగతామాలో అధికసంఖ్యాకులు ఎల్లావున్నవారల్లానే వుండిపోతారు గదా! గతంలో మేమెప్పుడైనా మనుష్యులుగ ఉంటిమో లేక మనుష్యుల

రూపాల్లో మట్టిబొమ్మలుగా ఉంటిమో చెప్పడం కష్టం. ఏదోవిధంగా మమ్మల్ని వాల్మీకి వంశజ్ఞులుగా ఎన్నారు. ఈ బానిసత్వంనుంచి ముక్తిపొందే లోపలనే నెమ్మదిగా మేం నశించిపోయేటట్టుతోస్తున్నది. మాభవిష్యత్ బొత్తిగా ఉజ్వలంగా కనుపించడంలేదు. కనుకనే మీరెన్ని నీతిమార్గాలు చూపించినా, మంచినడతను గురించి బోధించినా అవి మాకు యిసుమంతకూడా అంటడంలేదు. అందుచేత మేము హడ్‌తాల్, తోడ్‌పోడ్ ఇంకా ఇలాంటి తుంటరినులు చేయడానికి పరుగులిడుతున్నామంటే, ఇందులో ఆశ్చర్య పడవలసినదేమున్నది?''

ఈ భంగీవెల్లడించిన ఆవేదనలో నిరాశ' నిస్పృహ వెల్లడవుతున్నది సరిగదా? పర్వతంలోపల దాగివున్న జ్వాలాముఖికూడా ఉన్నదని ద్యోతకమౌవుతున్నది. సమాజానికి చాలెంజికూడా లేకపోలేదు. అతడు తన వర్తమాన వృత్తి త్యజిస్తాడు. నిజమే కాని తరువాతనో? నూతనవృత్తి నవలభించడంలో ఎన్ని కష్టాలను ఎదుర్కొనవలసి వస్తున్నదో ఎవరికెరుక? పనులు లేని సమయాలలో ఆకలిమంటలతో వస్తువు పడి వుండవలసిన స్థితిరావచ్చును. అలాంటిపరిస్థితిలో మీరు మలమూత్రాదులెత్తడం విడిచిపెట్టండని ఉపదేశించే వారి పైన ఆకలిగొన్న సింహంలా విరుచుకు పడరా?

ఇటువంటి సంకట పరిస్థితిలో 'భంగీముక్తి' మాటవిడిచిపెట్టవలసినదేన? ఇది విప్లవాత్మకమైన ప్రశ్న. కేవలం సంస్కరించి, మార్గం చూపే ప్రశ్నకాదు. ''భంగీలు ఏపనులవలంబించాలి? అన్న ప్రశ్నకు జవాబు ప్రభుత్వం' రచనాత్మకసంస్థలు, మన నాయకులు ఇవ్వాలి. అనేక కోట్లమంది కాందిశీకులకు ప్రతికూలపరిస్థితుల్లో సహితం వసతులువృత్తులు

సునాయాసంగా ఏర్పాట్లు చేసినప్రభుత్వం మలమూత్రాదులెత్తడం కుల వృత్తిగా గల అల్పసంఖ్యాకులైన భంగీలకు ఇతరవృత్తులు కల్పించలేదా? విప్లవాత్మకమైన ప్రతి అడుగడుకీ కొన్నియిబ్బందులు కష్టాలు కలగక మానవు. అది సహజంకూడాను.



మలమూత్రాదులెత్తే వృత్తిని విడిచిపెట్టిన పరివారాలకు యీదిగువ పేర్కొన బడిన వృత్తులిలాంటివి కల్పించ వచ్చును.

1. భంగీల బాలబాలికలకు ఆశ్రమస్కూళ్ళు తెరవడం, గృహ పరిశ్రమలు నేర్పడం మొదలయిన ఏర్పాట్లు ప్రభుత్వం జేయాలి, లేక ప్రయివేటుసంస్థలు చేయాలి.



2. విద్యావంతులైన భంగీలకు విభిన్న ప్రభుత్వ విభాగాల్లో తప్పనిసరిగా పనులు కల్పించాలి. ఈ నియామకాల్లో కాస్త ఉదారత కూడా చూపాలి.



3. మలమూత్రాదులనైతే వృత్తిని విడిచిన భంగీ పరివారాలు వ్యవసాయం చేసుకోదలచిన ఎడల వారికలాంటి అవకాశాలు కల్పించాలి దానికి కావలసిన పనిముట్లుకూడా సప్లైచేయాలి.

4. ప్రాంతీయ ప్రభుత్వాలు, మునిసిపాల్టీలు చక్కగా సంస్కరించ బడిన వైజ్ఞానిక సాధనాలతో, నూతన వైజ్ఞానిక పద్ధతులతో శానిటరీ కార్యం చేయించాలి, అలా చేయించని ఎడల యితర జాతుల వారు కొందరీ వృత్తినవలింభించ వచ్చును. అస్పృశ్యత పాటించని పక్షంలో ఆ భంగీలుకూడా ఇతర వృత్తుల వలెనే యీవృత్తినవలంబించ వచ్చు కూడాను.

అస్పృశ్యతా నివారణసందర్భంలో 'భంగీముక్తి కార్యక్రమం సరయినదని చెప్పడానికి సందేహం లేదు. ఇందుకే గాంధీ శతాబ్ది రాష్ట్రీయ సమితి, హరిజనసేవక్ సంఘం యీ కార్యక్రమం అమల్లోపెట్ట డానికి ప్రయత్నిస్తున్నవి.

## ఒక శుభారంభం

నిమ్నజాతుల్లో నెమ్మదినెమ్మదిగా సహజ మానవ అధికారాలుపొం దాలనే జాగృతి, ధైర్యాలు కలుగుతున్నవి. ఇదొక శుభారాంభమని చెప్పాలి. ఇటు ప్రభుత్వఆఫీసర్లు ప్రజానాయకుల సానుభూతి లభించిన ఎడల వారిఉత్సాహ ప్రోత్సాహాలు మరింతఇనుమడించగలవు. వారిపుడు అవమానంసహించేస్థితిలో లేరు. అస్పృశ్యత అసహ్యమనిపిస్తుంది. '' ఇక మాశోషణ '' కానివ్వమనేజాగృతి నిమ్నజాతుల్లో కలుగుతున్నది ఇది సుభారంభమని చెప్పడానికి సందేహంలేదు.

ఇన్ని పరివర్తనలు కలిగినప్పటికీ అస్పృశ్యత మొదలంట నశించిందనడానికి హరిజనులు హిందూసమాజంతో కలసిపోయ్యారనడానికి వీలులేదు. వారిపట్లగల భేదభావం పూర్వంకన్నా కాస్త తగ్గిన మాట నిజమే, కాని భేదభావం మాత్రం పోలేదు. భయానకం, లజ్జాకరం అయిన దాని రూపాలు అప్పుడప్పుడూ అవుపడుతూనే వున్నవి. ఇదిచూసి నప్పుడల్లా గాంధీజీ చేసివెళ్ళిన ఉపదేశాలంతగా అమలు జరగడం లేదని పిస్తున్నది. అన్నిటికంటే విచారకరమైన సంగతి ధర్మం సంఘసంస్క రణల లాంటి కార్యాలు ప్రభుత్వపరం చేయడమే. కొన్నికొన్ని సమ

యాలలో భౌతికసాధనాలధికంగా లభించడంద్వారకూడా కర్యాంలో శిథిలత వస్తుంది. అస్పృశ్యతలాంటి సామాజిక మహాపాపం నాశనం చేయడానికి భౌతికసాధనలంతగా అవసరంలేదు. అస్పృశ్యతా నివారణార్థం ఒక మర్యాదమేరకు చట్టమెంత అవసరమో, స్థూలప్రచారంకూడా అంత అవసరమే.

## నిష్ఠతో ప్రచారం

ఆచరణలోగల లోపాలను వ్యవహారలోపాలను ప్రచారం తీర్చలేని మాటనిజమే. అంతమాత్రాన అస్పృశ్యతా నివారణ విషయంలో ప్రచారాలవసరం లేదని చెప్పలేం. అదెంతైనఅవసరం ఆచరణప్రచారాల మధ్య సామరస్యమెంతో అవసరం. అస్పృశ్యతా నివారణ సందర్భంలో ప్రచారం చాలాఅవసరం . కేవలం ప్రచారమేకాక ఆప్రచారకునిలో ఆచరణవున్నట్లయితే మరీ ఆనందం. ఇదేవిధంగా క్రియాత్మక ప్రచారం ద్వారా యితరుల హృదయాలను తేలికగా మార్చవచ్చును. "హృదయపరివర్తనం అంటూశబ్దాలను వల్లించినంత మాత్రాన ఇతరుల మనస్సును మార్చలేం. ఎవరైన ఒక విషయం, ఏకొంచమైనా ఆచరించినారనుకుంటే ఆదివారు ఇతరుల వద్ద వ్యక్తపరచకుండా వుండలేరు. అదే నిజమైన ప్రచారం. దాని ప్రభావమే ఇతరులమీద అధికంగా పడగలదు. ప్రతి అగ్రజాతివ్యక్తికూడా ఆ ప్రచారంకు చేరవలసినదే.

హిందూధర్మం, హిందూసమాజంమీద పడిన అస్పృశ్యతా కళంకం ప్రత్యక్షంగా చూసిన వ్యక్తి, ఆ కళంకం కడిగివేయడానికి మనస్సులో ఆవేదనపడిన వ్యక్తి. తానెక్కడన్నా ఎట్టిస్థితిలోవున్నా

అస్పృశ్యత పాటించు వ్యక్తి ఎక్కడున్నా ఎటువంటిపరిస్థితిలోవున్నా తనకు ప్రత్యక్షమైనప్పుడల్లా రాబోయేప్రమాదం గురించి హెచ్చరిక చేస్తూనే ఉంటాడు, మరీమరీ చేస్తూవుంటాడు:—

" నిరర్థకమయ్యా నీతత్వజ్ఞానమంతాను, నీవుచదివిన గ్రంధసముదాయం నీకెరుకేలేదు. అవే నీకండ్లమీదపొరలా కప్పివుంచాయని. వాటి ఆధారంమీదగానే నీమట్టుకు నీవే అందరికంటె నేనే కులీనుడనని. మిగతా వారంతా నీచులనిన్నీ అనుకుంటున్నావు.

" నీవు ప్రకృతి హాస్యాలను, ప్రపంచ రహస్యాలను, కనుగొనడానికి యత్నించావు. ఆకాశంలో నక్షత్రాలను, పాతాళములో రత్నాలను కనున్నాగొన్నావు. కానీ తోటిమానవుని నేటివరకు గుర్తించలేకపోయావు"

" వ్యర్థమయ్యా నీ ఉపాసన సాధనాలన్నీని, తోడిమానవునయితే విడిచివుచ్చావు. ఇంకెక్కడెక్కడో పరమేశ్వరుని వెదుకుతున్నావు, పూజిస్తున్నావు."

"నీలాంటి మనిషే నీ నూతిలో నీళ్ళు తోడుకోలేనప్పుడు? నీ సమాజంలో అతనికి సమానమైన స్థానం లేనప్పుడు? ఎందుకొచ్చిందయ్యా ఆ ద్వైతభావన?'

" ఛీ! 'నేహనాస్తికించిన" నీ యీడిండిమ ఘోషనేదెందు కక్కరకొస్తుందయ్యా?'

" నిన్ను నీవు కాస్త గంభీరంగా, దీర్ఘంగా ఆలోచించి చూడు ఇంతకూ నీవెవరోను, దేంట్లో గొప్పవాడవోను?"

"సిగ్గేయడం లేదా? యీకళంక మచ్చను నొసట పెట్టుకు తిరుగు తున్నావు. ఈ నల్లని మచ్చనే విలువైన ఆ భూషణంగా తలుస్తున్నావు."

" ఎందుకు పనికి వస్తుంది అందర్నీ ఉద్ధరిస్తాననే నీ వాగ్దానం? తోడిమానవులను తిరస్కరించి, ఉపేక్షితెచి యింకెవరి ఉద్ధరణ సాదించ గలవు?

" నీ సమస్తకల్పనలూ, యోచనలూ, అన్నీ శబ్దాడంబరాలేగా? మనిషిని మనిషి రూపంలో నీవు చూడనంతవరకూని? వీలయినంత తొందరగా యీమహారొంపి నుండి బైటపడు."

" నిన్ను నీవు స్వాధీనుడవుగా తలచుకుంటున్నావు. అంతే నిజానికి నీవు పరాధీనుడవు, ఖానిసవు. ఉచ్చ నీచభావరుంజాటంలో నిన్ను నీవు యిరుకించు కున్నప్పుడు? మగ్గి మలినమయిన పురాతనాచారాలకి నీస్వాతంత్ర్యమేంగాను?"

" మరవబోకు గాంధీజీ సమక్షంలో లేడని! అంతరిక్షంనుంచి ఆయన తొంగి తొంగి చూస్తూనే ఉన్నాడు. చపకబారు యీస్మారకాలతో ఆయన మనస్సు రంజింపచేయలేవు. సమయంలోపల నీవు "దూరంగా తొలుగు, నన్ను ముట్టుకోవద్దు "అనే దుర్భావవలను త్యజించి మేలకోక పోతివా? గాంధీజీ ఆయనకు పూర్వం ఉన్న ఋషుల కోపం నీపై కురవక మానదు. ఆ అభిశాపంనుంచి రక్షింపబడలేవుసుమా?"

" విస్మరించకు ఉటీయమానమయిన నీ ఆర్య పరంపరను. తొలగించు నీవు దానిపై కప్పివుంచిన పరదాను."

## ఆర్థికోన్నతి కూడాను

అర్థిక ప్రశ్నకూడా ఒకటుంది. ఇది ఉపేక్షించరానిది. ఆర్థికంగా అభివృద్ధి పొందినంత మాత్రాన అస్పృశ్యత కూకటివేళ్ళతో నాశనమవు తుందనలేము. కాని హరిజనుల ఆర్థిక పతనం అస్పృశ్యతాభివృద్ధికి సహాయ మయిందన్నమాట నిజం. కనుక ఆర్థిక విషయమంతా సార హీనమయింది కాదు. లక్షలాది హరిజనులకు నేడు భూములు లేవు. చేసుకు బ్రతకడానికి పరిశ్రమలు లేవు. పంచవర్ష ప్రణాళికలు వచ్చాయి. పోయాయి. కాని అవి వారికి గుడిసెలు వేసుకోడానికిగాని, ఇండ్లుకట్టుకో డానికిగాని సరిపడే స్థలాలయినా ఇవ్వలేక పోయాయి. ఇందెంతయు దుఃఖదాయకమైన విషయం.

## ఆ తపస్సు, ఆ సంకల్పం

అస్పృశ్యతా సందర్భంలో ఇంతవరకు జరిగిన పనికి సంతోషించ వలసిన పనిలేదు. ఇంకా జరగవలసిన కార్యవిషయం గురించి నిరాశ చెందవలసిన పనిలేదు, హిందూసమాజంలో దాగిమణిగి వున్న ప్రేరణా శక్తిని పైకితీసి, దాని ద్వారా అస్పృశ్యతను తప్పనిసరిగా కూకటివేళ్ళతో పెగలించి వేయవచ్చును.

జ్ఞాపకం చేసుకోవాలి ఆ పవిత్ర సంకల్పం. ఇంకొకసారి స్మరించుకోవాలి 'పూనా ఒడంబడిక' జరిగిన వెంటనే పండిత మదన మోహనమాళవ్యా గారి అధ్యక్షతలో బొంబాయిసభలో చేసిన వాగ్దానాలను ఇంకాఅస్పృశ్యతా నివారణం, హరిజన సేవా ప్రవర్తికి పవిత్రత, వేగం కల్పించడానికి గాంధీజీ నలిపిన 21రోజుల ఆ మహాతపస్సును గంభీరతా పూర్వకంగా స్మరించడం ఎంతో అవసరం



# పరిశిష్టం నెం. 1

1932 సెప్టెంబరునెలలో గాంధీజీ యరవడా జైల్లో చరిత్ర ప్రఖ్యాతిగాంచిన ఉపవాసం చేశారు. దాని పూర్తి వివరాలు దిగువ నిస్తున్నారు:—

13 నవంబరు 1931.

లండనులో జరిగిన రెండవ రౌండ్‌టేబిలు కాన్ఫరెన్సులో అల్ప సంఖ్యాక సమితిలో గాంధీజీ యీ ప్రకటన చేశారు. 'హరిజనుల మేలు కొరకు నా ప్రాణాన్నయినా ఒడ్డి ప్రత్యేకనియోజక పద్ధతిని వ్యతిరేకిస్తాను.'

11 మార్చి 1932,

భారతమంత్రి సర్ శామ్యూల్‌హోర్‌కు గాంధీజీ యీ విధంగా జాబు వ్రాశారు:—'1931 నవంబరు 13 న లండన్‌లో అల్పసంఖ్యాక సమితిలో వెల్లడించిన ప్రకారం ఆమరణోపవాసం చేయ నిశ్చయించుకున్నాను.

13 ఏప్రిల్ 1931.

సర్ శ్యామ్యూల్‌హోర్ గాంధీజీ జాబుకు జవాబిచ్చారు.

17 అగస్టు 1931.

ముందు నిర్మాణం కాబోయే భారతీయ రాజ్యాంగంలో సాంప్రదాయక ప్రాతినిధ్యం గురించిన బ్రిటిష ప్రభువుల అ నిర్ణయం ప్రకటించారు,

18 ఆగస్టు 1931.

బ్రిటిష ప్రధానమంత్రికి గాంధీజీ జాబు వ్రాశారు.

8 సెప్టెంబరు 1931.

బ్రిటిష ప్రధానమంత్రినుంచి జవాబు వచ్చింది.

9 సెప్టెంబరు 1931.

గాంధీజీ ప్రధానమలత్రికి తన అంతిమ నిర్ణయం తెలియజేశారు,

12 సెప్టెంబరు 1981.

గాంధీజీ, సర్ శామ్యూల్‌హోర్, రామ్సే మేగ్డనాల్డుల జాబులు ప్రకటించబడ్డాయి.

15 సెప్టెంబరు 1931.

గాంధీజీ బొంబాయి ప్రభుత్వానికి జాబు వ్రాశారు.

19 సెప్టెంబరు 1931.

బొంబాయిలో ప్రజానాయకుల సభ జరిగింది. దాని ప్రతినిధులు యరవడా జైల్లో గాంధీగారిని కలుసుకున్నారు.

30 సెప్టెంబరు 1931.

ఉపవాస మారంభమయింది. గాంధీజీని పత్రికా ప్రతినిధులు మొదటిసారిగా కలుసుకున్నారు.

23 సెప్టెంబరు 1931. 

గాంధీగారి పరిస్థితి ప్రమాదకరంగా పరిణమించింది.

24 సెప్టెంబరు 1931. 

యరవడా ఒప్పందంమీద సంతకాలు జరిగాయి.

26 సెప్టెంబరు 1931. 

డాక్టర్ల అభిప్రాయం ప్రకారం గాంధీగారిస్థితి మరింత ప్రమాదకరమయింది. ప్రభుత్వం యరవడా ఒప్పందం అంగీకరించింది. ఉపవాసం విరమించబడినది.

27 సెప్టెంబరు 1931

గాంధీజీ ఒక ప్రకటనద్వారా పత్రికా ప్రతినిధులకు జవాబిచ్చారు. అందు కొన్ని షరతులమీద వారి సహాయం కోరారు.

30 సెప్టెంబరు 1931.

జైల్లో గాంధీగారిమీద మరల ఆంక్షలు పెరిగినాయి.

4 నవంబరు 1931.

అస్పృశ్యతానివారణ కార్యకలాపాలు నడుపుటకోసం గాంధీజీకి మరల అవకాశాలు కలిగించారు.

గురువాయూరు మందిరప్రవేశంగురించి అవసరమైతే మరల ఉపవాసం చేస్తానని ఆశయంగల ఒక ప్రకటనచేశారు గాంధీజీ.